# మున్నుడువు

ఆంధ్ర మహతీ భారతీ ప్రజామిత్రాదిపత్రికలలో, రైతుబిడ్డ మున్నగు చలనచిత్రములలో, హచ్చిన్సు లోనగు వణిఙ్మండలుల శబ్దగ్రాహులలో, రైతుభజనావళి మొదలగు నితరసంపుటములలోఁ జెదరి చెదరి పఱిగకంకులంబలెఁ బడి యున్న నా చిఱుకబ్బముల నొక్కచోఁ గూర్చుట యుక్త మని తలంచి "పఱిగపంట" అను పేర ౧౯౪౩ లో వాని నాంధ్రావలికి సమర్పించితిని.

తరువాత ౧౯౪౮ నాఁటి కిట్టిరచనలు మఱికొన్ని వెడలెను. అందు వలఁతి వలఁతి కైతలు పెక్కు లుండుటం జేసి "పెద్దకాపు" (పెద్దపంట - బాడె - (భాషకు) పెద్దరక్షణ) అను పేరిడి వాని నప్పుడు వెలారించితిని.

ఇపు డీ రెండుసంపుటములును బునర్ముద్రణమున కెదురు చూచుచుండుటచే నే నీపనికి సమకట్టితిని. విలువంగోరువా సౌకర్యము వలచి నేఁ డీ రెంటి నేకముచేసి మొదటిదాని కే యుంచితిని. వస్తుసంబంధమునుబట్టి యిందలిముక్కలు ' ~ టిని 'రాష్ట్రగానము' నకై వేఱుచేసితిని. అనావశ్యకః తోఁచినభాగము లుజ్జనచేసితిని. తక్కినవాన నిం- మార్పులు, చేర్పులు కావించితిని. క్రొత్తలు కొన్ని హత్తించితిని.

ఇంతకుమున్నొక్కటి యొక్కటిగా వెలువరించిన – భజ
గోవిందమ్, అమరజ్యోతి, తపస్సిద్ధి – అను చిన్నచిన్నకృతులను
సైతము దీనిలోఁ గలిపితిని. కావున నిప్పటి కిది నాఖండకావ్య
ముల సమగ్రసంపుట మని చెప్పవచ్చును.

నిడుఁబ్రోలియున్నతపాఠశాలకుఁ దన యెల్లకల్మియు
నప్పనచేసి నిఱుపేదయైన నెఱదాత కొసరాజు లక్ష్మయ్యకు
నుడుగర గావించిన పఱిగపంట నేఁడిట్లు పెరుఁగుట కా నెఱదాత
నిఱుపేద యగుటదాఁక డిగుటయే కారణము.

ఒకానొక తెలుఁగుపత్రికవారు 'పెద్దకాపు'ను సమీక్షిం
చిననాఁడు నేఁ డిందుఁజేరిన 'ఆవేదన' అనుకావ్య మాత్మస్తుతి
యని యెల్లిదము లాడిరి. శ్రోతులు పరికించినచో వారి కందలి
కలరూపు తెల్లమి యయ్యెడిది. కాని యోపిక యేదీ? సత్యానిరతి
మాత్రము కలదా? ఉన్నచో 'మల్లెపూలదోసిల్లు' అనుకరణం
బని పదరుదురా? అట్లనుట క్రించుఁదన మని వీరికిఁ
దోఁపవలదా? వీ రింతటితో నాఁగక "ఈగ్రంథము పెద్దదగాగా
యున్నది.........'కాపు'కథన మిం దెచ్చటనూ కానవచ్చు
టయే లేదు. కేవలము మసిపూతకు 'శివుని మాపెద్దకాపు
ప్పింప రండు'అని దైవస్తోత్ర మొకటి ఇరికింపబడి యున్నది"
నిమాడఁ దూలనాడుటకుఁ దెగువచేసిరి. 'కాపు' – అనఁగా
ద్యగాఁడని వీరితలంపు. కావుననే నాగ్రంథమున 'శివుని మా
ద్దకాఁపును'అని తేటతెల్లగా నున్నను దాని నుదాహరించు
ట 'శివుని మా పెద్దకాపును' అనియు వీరు వ్రాయసము పొసఁగి

నది. కాపు - కాఁపుల కర్థభేదము కలదని వీ రెఱుఁగరు. ఈ యెఱుఁగమికి నేఁటివిద్యావిధానమే కారణము. ఇందు లాఁతి బాసకున్న పెద్దఱికములోఁ గీసపాటైనను దేశభాషకు లేదుగదా! ఆంగ్లశబ్ద వర్ణక్రమము దెసఁ జూపు శ్రద్ధాసక్తులు తెలుఁగుంబల్కు-రూపునెడ నైతము పాటింపఁగల్గిననాఁడు కాపు-కాఁపు, పాడి-పాఁడి, తీరు-తీఱు, నీరు-నీఱు మున్నగుతావులం గల వేఱ్మి చులుకం దెలియును. ఈ తెలివి లేనివారే నేఁటి విమర్శకులలోఁ పెక్కు-రున్నారు. అందొకానొకఁడు నాపాలఁ బడియె. అతని చలువచే మన భాషాజిజ్ఞాసువుల కీపాటిపాఠము గఱపుభాగ్యము నాకు దక్కినది. కాని పేరుపడ్డపత్రిక లిట్టి పెడవ్రాఁతలు-వెడ పల్కులు బయల్పఱిచి పేరుపడ్డపత్రికలు కారా దని నాకోర్కి. అవి వర్తమానములతోటయ కాదు, వర్ధమానములును గావలయు.

'ఆవేదన' అన్న కావ్య మొక మహాకవి పేదఱిమిని గన్నారఁజూచి కలఁగి కలఁగి వ్రాసితిననియు, నందలి 'పాశ్చాత్య విజ్ఞానపండితుండు' మున్నగు ప్రయోగములు తనకుం బోల వనియు, నాత్మస్తుతి కీకొన్నను సీతారామమూర్తి "ఇంతటి కవీంద్రులేమిడి యిట్టి దనుచుఁ। జెప్పుటకు నాదు లేఖిని సిగ్గు వడియె"నని పొవులం దగిన యక్కఱపాటు గలవాఁడు కాఁడనియు, నితనిని, వీనిపల్కు-ను వెక్కిరించుట యన నలంతిచేఁత గా దనియు హెచ్చరించుట నా కనిష్టమైనను నేఁడు కనిష్ట కర్తవ్యము. దుర్బలులగు విమర్శకులపెనుపుం గోరి యే నిట్లు చెప్పుకొనుట తప్పనిసరి యయ్యె.

అయ్యది య ట్లుండె.

దేశవాచి యగు 'నాడు' నారచనలో 'నాఁడు' గా నుండును. ఈమార్పునకు శాసనములలోని 'కమ్మనాండు, వెలనాండు' మొదలగు రూపము లాధారములు.

ఇఁక — బహుకార్యవ్యగ్రు లయ్యు నాయందలి యను రాగముకతన నీ కావ్యావలిని సమీక్షించిన మహాకవులు, సౌజన్యమూర్తులు శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారికి నా కృతజ్ఞతాపూర్వకనమస్కృతులర్పించుచు, నస్మదీయంబగు నేక పంచాశత్తమ (౫౧) జనుర్వాసరమునాఁ డంధ్రశారద కీ పరి ష్కారము నర్పింపఁగల్గితి నని సాహిత్యసౌహిత్యముం బడచుచుఁ దెలుఁగుసోదరులు యథాపూర్వము న న్నాదరింతు రని విశ్వ సించు చున్నాఁడ.

తెలుఁగులెంక

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

౨౫-౧౨-౫౧

# పురస్కృతి

నూటయేబది యేండ్లుగా మనదేశములో నిరాఘాటంగా చెల్లివస్తున్న తెల్లదొరతనంవల్ల మన వేషభాషలు, ఆచార వ్యవహారాలూ, సభ్యతా సంస్కృతులూ తారుమారై పోయి నవి. "తల్లికౌగిలి"వంటి పల్లెటూళ్ళనివాసం పంచాగ్ని మధ్య మైనది. "పంటదొరలు" పాడైపోయి "పేదకూడు కుడుస్తు న్నారు." "సాదుపలువలైన వకీళ్ళకు, వలకారిజిత్తులాండ్రగు బేకులకు" నిలయములైన పట్నవాసాలు పల్లెలను పీల్చి పిప్పిచేస్తున్నవి. "దక్షిణాపథమును బాహువప్రమున బ్రోచిన" యాంధ్రజాతి నిస్తేజమై నిర్వీర్యమై "వివేకం తటికి" తన యౌదార్యమును "సిగరెట్టు ముక్కకు చెక్కలు మార్చ డంలో, ఎలెక్షను కాండలో సివంబెక్కి వేలకువేలు సొమ్మును పుచ్చిన వక్కలవలె బలియివ్వడంలో" మాత్రం మిగుల్చు కొన్నది. సంఘానికి శక్తి చచ్చిపోయింది. అసూయాద్వేష ములు మెండుకున్నవి. "తాలువిత్తినచో వరాల గుత్తులు పండే" భారత సవిత్రి నిష్పచ్చరంతో ముచ్చుముడిగి పోయింది. పారతంత్ర్య లక్షణాలన్నీ సుసంపన్నములై జాతిని జీవచ్ఛవాన్ని చేసివైచినవి.

ఈ యధోగతినుండి దేశము నుద్ధరించుటకు, మళ్ళా స్వస్వరూప సాక్షాత్కారం కలిగించుటకు దేశంలో బహు ముఖమైన యుద్యమం తలయెత్తింది. సంస్కర్తలూ, రాజనీతి కోవిదులూ, పండితులూ, భక్తులూ, కవులూ ఈ పతిత

భారతమును మళ్ళా అనేకవిధాల మేల్కొల్పడానికి యత్నిస్తున్నారు. సీతారామమూర్తిచౌదరిగారు ఈ మహోద్యమమునకు నడుము గట్టిన కవులలో ప్రథమగణ్యులు.

ముప్పదియేండ్ల క్రితం ఆంధ్రోద్యమం తప్పటడుగులు వేసే తొలినాళ్ళలో రాయప్రోలు సుబ్బరాయకవి "ఆంధ్రుల మహోజ్జలచరిత్ర చావలేదు చావలేదు' అంటూ ఎలుగెత్తి చాటెను. క్రమంగా ఆరంభశూరత్వం చచ్చి, మళ్ళా ఆంధ్రోద్యమం గుంటపూలుపూస్తూ, తిరిగి ఓఢ్రదేశవిభజనతో తల యెత్తింది. ఆ శుభావసరాన చౌదరిగారు వేయికంఠాలతో చేసిన రాష్ట్రగానం ఆంధ్రులహృదయాలకు చబుకుదెబ్బయై వీరరసావతారులను చేసివైచినది. పారతంత్ర్యాన్ని బలియిచ్చే తెలుగుదేవరకొలుపులో చౌదరిగారి రాష్ట్రగానం పంబజోడై మ్రోగింది.

౧౯౨౮ నుండి నేటివఱకు గడచిన్న కాలములో చౌదరిగారెడపదడప రచియించిన కృతులన్నీ పతిగయేరి యీ గ్రంథరూపాననిపుడుపంటపండించారు. రచనాకాలమునుబట్టి మొదటిదైన "అనుతాప" మనే కృతిలోనే ఆంధ్రుల పౌరుషప్రతాపాలు పొంగి పొరలినతొలినాళ్ళలో నేను పుట్టకపోతినిగదా అని చౌదరిగారు అనుతాపాన్ని వెల్లడించారు. ఆ పుణ్యదినాలలో చౌదరిగారు పుట్టియే యుందురని నే ననుకొంటాను. లేనిచో ఆవీరరస భావస్మృతులు వారియందింత గాటముగా మొలకెత్తేవికావు. తలపులో పలుకులో చేతలలో వారికెంత శ్రోత్రియత్వం అలవడేది

కాదు. నిక్షేపమువలె చేజిక్కిన పైడియిటుకలను దక్కించుకోలేక తిరిగి కోమటయ్య కర్పించి నీతులు కొట్టిపోసిన వెట్టినారయ్య కడుపున బుట్టినారు చౌదరిగారు. ఆ నారయ్య నిండుమనస్సులో వెలిగిన జ్యోతియే చౌదరిగారియందు వెలిగి వారి కింతటి అభిజనాభిమానం సమకూర్చి పెట్టింది.

తెలుగుజాతినీ దేశమునూ తలచుకొంటే చౌదరిగారి "కన్నులాణిముత్యాలగనులై" పోతవి. "కృష్ణాగౌతములు తెలుగుతల్లికి ముద్దుకూతులై తెలుగుచేలూ తెలుగుతోటలూ పండించి పైడిపాతర్లు కప్పుతున్నవి." "గమగమలాడు పైర వంకాయకూరా, నాల్కతుప్పుడులేచేడి నక్కదోసబజ్జీ, మదురు గుమ్మడిపండు ముదురుపులుసూ, జిడ్డుదేరిన వెన్నెలగడ్డపెరుగూ" అనుభవించే తెలుగుభోగం తలచుకుంటే "పళ్ళపుల్లనై పోతవి." "హేమంత వీథులయందు భాగ్యాల కడలియై కదలివచ్చే మకరసంక్రాంతి" యందు తెలుగుతల్లి అద్భుతదర్శనం లభిస్తున్నది. "సంక్రాంతి" అనేకృతి భావనలో, భాషలో సర్వోత్తమమై తెలుగునాటి భోగభాగ్యాలను, సరససల్లాపాలను, నడతనాగరీకతలను కన్నులకుగట్టునట్లు, నోరూరునట్లు చిత్రిస్తున్నది. చౌదరిగారు అచ్చమైన రైతుబిడ్డ. నిజమైన తెలుగు కవి. పల్లెల సౌభాగ్యాన్ని చిత్రించే సిద్ధహస్తుడు.

ఓరుగల్లులో, పల్నాడులో, విద్యానగరంలో ధ్వజినీ నాథులై తెలుగుమాగాణమును తమ రక్తధారలతో తడిపిన రావుతులవంశంలో బుట్టినచౌదరిగారి కలము ఎంతసేపూ వీర

రసము నాశ్రయిస్తుంది. "తెలుగుబిడ్డల చిఱువేడి పలుకు నెత్తుటేర్లు తుకతుక నుడికి పొంగత్తి పొరలునట్లు వీరగీతాలు వీను మిగిలిన" పల్నాటి పౌరుషమును దలపోసి "పోటు మానుసులం గన్న ఆపోతుగడ్డ"ను గూర్చి వారు పలువిధాల వలపోస్తారు. ఒక్క పల్నాటిలోనే కాదు. బొబ్బిలిలోనే కాదు. పాంచాలమున సిక్కుయోధులలోనే కాదు. వీరధర్మ మెచట బొడకట్టినా చౌదరి గారు రసపరతంత్రులై కలము బట్టుదురు. ఆ వీరధర్మాభిరతియే చౌదరిగారిచే ఈ గ్రంథమును కొసరాజు లక్ష్మయ్యగారికి కానుక పెట్టించినది.

ఆంధ్రులు నేడు ప్రాభవదూరులై అనుభవిస్తున్న దైన్యమును ౬౩ వ పుటలో నొక సీసపద్యమున వర్ణించి ఈ యవస్థలో తల్లి నాదుకోలేని "తెలుగుబిడ్డ బ్రదుకు బరువు చేటు" అని ఖండితంగా చెప్పి విడిచిరి. ఈ యలసత్వమునుండి, వైక్లబ్యమునుండి భారతజాతి మేలుకొనే శుభదినాలు వచ్చినవి. "నవయుగ మేగుదెంచి పరిణామము చెందె జగంబు" "దిశాంగణ మందు నటించే అనూతనచ్ఛవులు" చౌదరిగారికి పొడకట్టుటచే విద్యార్థులను "లెమ్మిక లె"మ్మని తట్టిలేపి ఆ శుభలగ్నమున కాయత్తుల నొనర్చుచున్నారు.

యుద్ధవీరముకంటె దానవీరమూ, ధర్మవీరమూ అంటే చౌదరిగారికి మఱీయిష్టము. ఆత్మార్పణము నేమి ధర్మజ్యోతి నేమి ఆత్మకథనేమి రచియించుటకు చౌదరిగారి ఈ వీరరస పర తంత్రతయే కారణం. కావ్యానికి నాడూ నేడూ శృంగారరసమే

ప్రధానాశ్రయం. కవులలో శృంగారమును విడిచినవారూ, విడువక మాటదక్కించుకున్నవారూ అరుదు. చౌదరిగారొక్కరే దానిజోలికి వెళ్ళకుండా ఉత్తమకావ్యములను రచింపగల్గిరి. స్వభావముచేతనే వారు వీరకరుణరసలుబ్ధులు.

ఆంగ్లసాహిత్య సంపర్కంవల్ల మన కావ్యప్రక్రియలలో నెన్నో మార్పులు వచ్చినవి. రవీంద్ర మహాకవి కావ్యమర్యాదలు కూడా మనం అలవరుచుకున్నాము. వీనితో పాటు హిందూస్థానీ నడకలుగూడా నేర్చుకొంటున్నది మనసాహిత్యం. నేటి కవులలో ఈ మూడు ప్రవాహాలను తప్పించుకున్నవారు నూటికి నలుగురుకూడా తేలరు. చౌదరిగారికవితయం దట్టి సాంకర్యము మందునకైనా దొరకదు. భావనలో, భావావిష్కరణంలో, వాక్యవిన్యాసంలో ఆంధ్రసాంప్రదాయం మూర్తీభవించి ఉంటుంది. పదబంధమేమి, సాఫుసంతనలేమి పూర్వమహాకవులను తలపిస్తూ, పులుముడూ అన్వయక్లిష్టతా వెలితీ లేక, సర్వాంగసుందరమైన చౌదరిగారికవిత్వం చదువుతూవుంటే ప్రాణాలు లేచివస్తవి. పద్యకావ్యములలో ఎడనెడ వారు రచియించే వచనములు సాగుతూ తిక్కన నోట్లోనుంచి ఊడిపడిన ట్లుండును. ధర్మజ్యోతియందు చౌదరిగారొక మహాక్కర రచియించారు. నన్నపార్యునికి బిమ్మట మళ్లా అంతచక్కగా అక్కరను రచియించినవారు లేరు. సంప్రదాయ సిద్ధమైన భాషామర్యాదలందు చౌదరిగారికుండే ప్రీతియే, నవీనులచే నిరసింపబడే చిన్నయసూరిని ప్రశంసింపజేసినది. తెలుగు కారకము చెడకుండా వాక్యరచన చేయడం వీరేశలింగంపంతులు మొదలుకొని నేటివఱకు గద్య

రచన చేస్తున్నవారిలో ఒక్క చౌదరిగారికే తెలుసును. "ఎల నాగమోవితో దులవచ్చు" తెలుగుకావ్యమునందు చౌదరి గారికి గల యీ అభిమానమే "గీర్వాణమెంత నీల్గిన జిల్బిలి తెలుంగు నుడిసొంపునకు దిగదుడుపుగాదో" అని పలికించినది. స్వస్థాన వేషభాషాదులపట్ల వారికి గల యీ అభిమానమే "వంగభస్మ" మనేకృతి రచియింపజేసినది.

తెలుగునుడికారముసొంపు చౌదరిగా రెఱిగినంతగా ఇతరు లెఱుగరేమో. వేమన్నను తిక్కన్నను గూడ మఱపిస్తూ ఉంటవి వారి తెలుగుపోకడలు. "క్షేత్రజీవి" అనే కృతిలో రెండవసీసమునందలి ఉత్తరార్ధములను బరికింపుడు. తెలుగు నుడికార మన్నప్పుడు నిజానికి తాళ్ళపాకవారిదీ, పదకవులదీ ఆ సొమ్ము. అట్టి సొంపు లుట్టిపడే రచన లీ గ్రంథమందు గోకొల్లలు. చౌదరిగారి యీ ఆంధ్రాభిమానము వేఱు. సనాతనధర్మాభిరతిని, ఆస్తిక్యమును కుదర్చించే ఇతరుల ఆవేశము వేఱు. చౌదరిగారి సంఘురక్తి, ఆంధ్రాభిమానము దేశభక్తి కడ్డురావు.

సాహితీరంగంలో తొలుతగా గజ్జెకట్టేవారికిగాని యిట్టి పురస్కారవచనములు కృతప్రతిష్ఠు లగు చౌదరిగారివంటి కవీశ్వరుల కక్కఱగావు. అయినా నాకు ధన్యతకల్పించుటకే వా రీకార్యము నాపై బూన్చిరి. చౌదరిగారి కవితాశక్తిని, సౌజన్యమును, ఆభిజాత్యమును గూర్చి యింక విస్తరింపక

"కత్తిపోటును మించిన కలముపోటు
మాట తీపిని గెలిచిన మనసు తీపి
సంఘశక్తిని మీఱిన జాతిశక్తి
నీక చెల్లుఁగదోయి"
అని వారిమాటలే వారి కప్పగించి యింతట ముగిస్తాను.

కాటూరి వేంకటేశ్వరరావు

౨౭–౧౦–౪౩

'పఱిగపంట' కీ పురస్కృతి చెప్పి ఎనిమిదేండ్లు గడచినవి. ఈ గ్రంథానికి ద్వితీయవార ముద్రణభాగ్యం లభించింది. ఈ లోపల దేశమున స్వరాజ్యలాభము మున్నగు అద్భుత ఘటన లెన్నో నడచినవి. స్వతంత్రభారతావతరణమున చౌదరిగారు హర్షపులకితగాత్రులై

"కులవర్గములు పెంచు క్రుళ్ళింత లేని...
ధనవద్దరిద్ర భేదచ్ఛాయలేని
పరులకూటికిమూఁగు బదనిక ల్లేని
విద్యావిహీను లే వీథిలోలేని...
జీవత్సమాజంబు సృష్టిగావించి
తమ్ముఁడా! నీ తేరు తరలింపవోయి!"

అంటూ సహజోత్సాహంతో ముందుత్రోవ వేలెత్తి చూపుతున్నారు, వారి వాక్కు అన్వర్థము గాకపోదు.

తెలుగువారి అధోగతికి మొదటినుంచి దురపిల్లుతూ వచ్చిన చౌదరిగారి కీ లోపల మరొక సంతోష మహావకాశం లభించింది. అది డాక్టరు పట్టాభిగారికి కాంగ్రెసు గద్దెపై పట్టాభిషేకం. ఆ యుత్సవమును పురస్కరించుకొని చౌదరిగారు "అతిదీనత నైచ్ఛిన తెల్గుజాతికే మల్లెలుపూచెరా! మలయ మండల మంజుల వాతపోతముల్ మెల్లన వీచెరా!" యని సంతోష పరవశులై పాడుకొనిరి. పాపం! చౌదరిగా రెంత అల్పసంతుష్టులోకదా! ఇంతటిలోనే తెలుగులకు పండువయ్యె ననుకొనిరి. మరి, వారు పరితపించి పాడిన రాష్ట్రగానం ఇంకా చెవులలో మ్రోగుతూనే ఉంది. దానికి ఫలసిద్ధి యెన్నటికో? అయితే, గుడ్డిలో మెల్ల యన్నట్లు తెలంగాణాకు మాత్రం విముక్తి కలిగింది. దానితో "మూఁడుకోట్ల తెలుఁగు లిప్పుడు ముక్తినందిరిరా" యని చౌదరిగారి 'విజయవాణి' పలికింది.

ఇలా చౌదరిగారి వాణి యెప్పటికప్పుడు కాలంతోపాటు, కాలంకంటే ముందు నడుస్తూ ఆశాకిరణాలను ప్రసరింపజేస్తూనే ఉంటుంది. మాతరం కవులందరూ అంతో యింతో విరహ విషాదము ననుభవించి వైక్లబ్యం పొందినవారే. చౌదరిగారు మాత్రం విషాదగీతిక లెన్నడు పాడక, ఆశాజ్యోతి చేబూని ఉత్సాహగీతములే పాడుచు వచ్చిరి.

చౌదరిగా రల్పసంతుష్టు లంటిని. ఈ కూర్పులో చేరిన 'కృతమెుుక' యను కావ్యమే అందుకు సాక్షి. తమకు పథ్యానికి గావలసి వచ్చిన గోదుమల నయాచితముగా నొసగిన కొుకానొక గేస్తు వితరణను గూర్చి ప్రవర్తించిన దది. చూచితిరా! వందలుగావు, వేలుగావు, గండపెండెరంగాదు, కనకాభిషేకం గాదు. మూడెడు గోధుమలు! ఈ భాగ్యాని కింతటి కావ్యం వ్రాసిరి చౌదరిగారు. అవును. చల్లపల్లి ప్రేనికి రాష్ట్రగానం కృతియిచ్చి, రాజాగారు ప్రార్థించినా వారిగడప త్రొక్కబోవని చౌదరిగారు ప్రతిఫల మొల్లనిదాతలు, తనపై ఋణ ముంచుకొనని ప్రతిగ్రహీతలుగదా! గుణమున్నచో కృతులు కానుక పెట్టుటేగాని కన్యాశుల్కముల నంగీకరింపరు వారు.

ఇంతటి సాధుచరిత మూరక పోవునా? మాతరం కవులలో నెవరికేని జరగని మహోత్సవము నిడుబ్రోలులో ఈ "అభినవ తిక్కన"కు జరిగినదంటే అబ్బుర మేమున్నది? గజారోహణంతో పాటు, కనకాభిషేకంతో పాటు, కృతిస్వీకారములతో పాటు కవికి జరగదగిన ఉత్సవము లన్నీ చౌదరిగారికానాడు జరిగినవి. పూర్వకృతమగు వారి తపస్సానాడు పండినది. కావుననే దానిని గూర్చి రచియించిన పద్యములకు 'తపస్సిద్ధి' యని పేరిడుటలో నెంత వినయము! ఎంతటి యాచితి!

ఈ కూర్పులో 'చుక్కలు' అనే పద్యాలనుగూడా క్రొత్తగా చేర్చారు. దీనిలో చౌదరిగారి ఉత్ప్రేక్షాకల్పన లతి

రమ్యము లగుటయేగాక ఆ కందముల పరుగు అందుకోరానిదిగా ఉంది. మింటవెలుగు చుక్కల ననేకవిధాల ఉత్ప్రేక్షించి, తుదకు

కాలెడి పొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై
సోలెడిమేనితో బడుగుజూపులతో నిజరక్తమాంసకం
కాళము లర్థమత్తులకుఁగా నిచటన్ బలివెట్టి రెవ్వ రా
మాలలు మాదిగల్ గగన మంటపమెక్కిరె యిట్లుచుక్కలై

అని ముగించటంలో ఉన్నసొంపు ఎంతని చెప్పను!

చిన్ననాటనే తెనిగించిన భజగోవిందమును, ఆవల కొంతకాలాన కాళిదాసకృతి ననుసరించి చేసిన సేవాధర్మమను రచనను ఈ కూర్పులో చేర్చుట మరొకవిశేషము. ఈ తెలుగు సేతలు ఎంతో సరసంగా కొనసాగినవి. ఇంచుమించు ఆ కాలం లోనే తిక్కన భారతము ననుసరించిన 'ఆత్మార్పణము' వలెనే యివియు ప్రౌఢములై, 'పూవు పుట్టగానే' అన్నసామెతకు సాక్ష్యమిస్తున్నవి. ఈ కృతులన్నీ పఠిగయేర్పులే అయినా ఎక్కడా తాలూ, తప్పు కనిపించదు సరిగదా, చౌదరిగారు కలంపట్టినది మొదలుకొని నేటివరకు వారు చేస్తున్నరచనలు ఎక్కడా జల్లుపొల్లులు లేక కండగలిగి, రసనిర్భరములగుట నాణ్యతోద్దృష్ట మని చెప్పాలి.

చౌదరిగారి రచనలన్నీ ఒకయెత్తు, 'ఆత్మకథ' ఒకయెత్తు. గాంధిజీపట్ల చౌదరిగారిభక్తి అతివేలము. కావుననే వారిరచన

లన్నిట నంతో యింతో గాంధిధర్మగంధం ఉంటూనేఉంది. "కన్నువిచ్చినవిదపన్ వ్రాసినదంతయు నీకథ, నీ సందేశంబ" యని వారన్నది నిజం. అట్టి భక్తిప్రపత్తులతో గాంధిచరితము పద్యకావ్యంగా రచియింప సంకల్పించారు చౌదరిగారు. ఆగ్రంథం తుదముట్టక ముందే 'అమరజ్యోతి' రచియింపవలసి వచ్చింది. పాపం!

"శతజన్మార్జిత మామకీనసుకృత స్థానమ్ముగా నీ జగా
బ్రతుకున్ జాటెడికావ్యమున్ సుకవితాప్రౌఢమ్ము నిర్మించి నా
బ్రతుకున్ ద్రోయఁదలంచుకొంటిమును; పాపంబెద్దియో పండి నీ
మృతిపై నేఁడు కృతిన్ రచించితి మహోర్మింబోని కన్నీటితోన్"

అని విలపించినా, వారిపూనిక తుదనెగ్గి 'ఆత్మకథ' పూర్తియై, ముద్రితమయింది. గాంధిచరితము రచియించుటకు "మహాత్ముని ఆస్థానకవి" యగు చౌదరిగారే సర్వవిధాల అర్హులు. కనుక 'ఆత్మకథ' పిమ్మట నడచిన గాంధిచరితమును గూడ చౌదరిగారు స్వతంత్రకావ్యముగా నిబంధించి చరితార్థులు కాగలరనే ఆశంసతో ఈపునఃపురస్కృతి ముగింతును.

ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘము
విజయవాడ

కాటూరి వేంకటేశ్వరరావు
౨౫—౧—౫౦

# మిత్రోక్తి

ఒక నిఱుపేదజీవి తన కున్నసమస్తము నొడ్డి బాల బా
లికల కళాభివృద్ధి కని లేమిని దా వరియించుగాథ నీ
వొక రసయుక్త ఘట్టమున నూఁది జగమ్ముల మేలుకొల్పి తో
సుకవివరేణ్య ! నీకవిత సూనృతవృత్తిని రాణకెక్కెరా !

అచ్చుఖర్చు లిచ్చి యందలా లెక్కించి
కార్ల మీఁదఁ ద్రిప్పుఘనులు గల్గ
లావు ధనము లేనిలక్ష్మయ్య కీ కృతి
నిచ్చినాఁడ వేల పిచ్చివాఁడ !

పలుచపలుచగ రాలు కంకులనె మట్టఁ
బఱిగపంటయె యింతగొప్పగ ఫలించెఁ
దీర్చివేసిన కుప్పలు నూర్చునప్పు
డెన్ని ధాన్యరాసులు మిన్నుదన్నఁగలవొ !

కృతిసమర్పణసభ
నిడుబ్రోలు
౧౭-3-౮౮

కవిరత్న
కొసరాజు రాఘవయ్య చౌదరి

# విషయసూచిక

తమ చనవులో నున్న
'నవభారతి' అను కావ్యము
నిందుఁ బ్రచురించుట
కంగీకరించిన
'ఆల్ ఇండియా రేడియో'
వారికిఁ గృతజ్ఞుఁడ.

రచయిత

# కానుక

చేత నొక కుంభకోణంపుఁజెంబుతోడఁ
గక్ష నొక వగ్గు వంకర కఱ్ఱతోడ
నొసటిపైఁ దిరునామంపుముసుఁగుతోడ
గునియు సనసన్నపసిఁడిపోఁగుళ్ళతోడ
మలఁచి కట్టిన నీర్కావివలువతోడ
డాపలించిన మీఁదిపుట్టమ్ముతోడ
బడలి పల్లకిబొంగైన యొడలితోడఁ
దళపి వెన్నెల విరియించు శిరముతోడఁ
దూలి గుంటలువడిన కన్దోయితోడఁ
దేపతేపకు బెదరెడి చూపుతోడ
నల్లనల్లన మునబడి కెల్లనాఁడు
వచ్చి గదిగది చూచు దేవళముఁ జేరి
వలగొనిన యట్లు బడిఁ జుట్టివచ్చుచుండు
నితనిఁ గన్నంతనే కుఱ్ఱ లిహీహీ యంచు
వినుకలిం బాసి గోల గావించుచుండు
రితని రాయిడి నానాఁటి కెచ్చఁదొడఁగ
నెవ్వఁ డీ వెఱ్ఱివాఁ డితం డెచటివాఁడు

గట్టిగా మందలింపక యిట్టివాని
నేల మన్నింతు రొజ్జ లిదేమి తాల్మి

*  *  *  *

రెండేఁడులనాఁ డజ్ఞత
నిండిన యిప్పలుకు లంటి నిడుఁబ్రోల్ బడిలోఁ
బండిన పాపం బపుడే
పండితుఁగా నిటుకుఁ దెచ్చి పడవైచె ననున్

ఆమాటలువిని సుగుణ
శ్రీమన్మణి సాటియొజ్జ చినరోశయుగా
రేమేమీ ! నీ వెఱుఁగవె
యీ మానిసికథలు వింత లీ నీ మాటల్

అచ్ఛశీలురు లోకసేవానురక్తు
లనఘు లిట్ల యుందురు వెంగళప్ప లట్లు
పసికిమాలిన చవటలు పట్టరాని
గడుసుడాబులతో మిట్టిపడుచునుంద్రు

నిడుఁబ్రోల్ కని పెంచిన దీ
బుడుతఁడు గొనరాజువారి పుణ్యగృహమునన్
పడిసన్న బాపయాఖ్యుని
కొడుకై లక్ష్మయ్య యితఁడు కొమరొందుఁ జుమా

*  *  *  *

పదియేండ్లకు మున్నీ బడిఁ
బదిమందిగు నాదరింపఁ బ్రజ పాలించెన్
మొదలిటినాళ్లన్ దీనికిఁ
గొదవలు పెక్కుండవెఁ దగినకోశము లేమిన్

ఇరువదారేండ్ల నాఁడియ్యది పొన్నూరఁ
బూరిపాకలలోనఁ బొద్దుపుచ్చు
తరుణమ్మునందుఁ దొల్కారివాన కడవలఁ
గుమ్మరించినయట్లు కురియఁజాగ
నప్పుడే సముద్రాంతమై మహాసంవర్త
తీవ్రవాతంబునా దిక్కుదంబ
మల్లాడ గిరులు కంపిల్లఁ బెల్లుగ రేఁగి
పెనుగాలి విసరెఁ దద్భీకరార్భ
టికి జగమ్ముగుండె వికవిక లయ్యెను
ధ్రూత మాయె సకలభూతరాశి
మోకు తిరుగలేని మ్రాఁకులు పెళపెళ
ధ్వనులతోడ వ్రస్సి ధరణిఁ గూలె

బడిపాకలు తొలిదెబ్బకె
యడఁగెన్ రాడులును గొమరు లాకులు పెండెల్
గడలున్ దడులున్ దొమ్మిది
కడలందున్ జెల్లచెదరుగాఁ బోయిపడెన్

బొమ్మలు తడిసెను దేశప
టమ్ములు చెడెఁ బుస్తకము లడంగె నెఱ్ఱాప
త్రమ్ములు నశించె బల్లలు
వమ్మయ్యెన్ దులువగాలివానకతాన్

పొలకల నైన బడిం గని
పొలిమేరల నుత్తరించి పొంగెడివంతన్
నిలుపంజాలక విద్యా
నిలయసభాసభ్యకోటి నిలువునఁ గూలెన్

సంతానం బెవనికి బడి,
సంతానం బెవఁడు పాఠశాలకు నాఁ డ
ప్పంతయుపంతులు లేమికిఁ
జింతాశరధేనువిద్ధచిత్తం బయ్యెన్

భావనాచార్యు లల్ల న్యాపతి హనూమ
దాఖ్యుఁడును మాడభూషి రామానుజార్యుఁ
డాదిగాఁ గల సభ్యు లయ్యవసరమున
సలమటం దిగఁద్రావి ధైర్యమ్ము నూఁది

వేలు గలవారి, లక్షలు
మూలుగులోఁగిళ్ళవారిముంగల, బడిబ
న్నాలు వివరించి మీకృప
కాలంబముగాఁగ దీని నరయుఁడు విజ్ఞుల్

అని విన్నవింప నొకఁడుఁ
గనికరమును జూపఁ డయ్యెఁ గర్తవ్య మికన్
మన కేద్ది యనుచుఁ గలఁగిన
మనములతో నింటిదెసకు మలఁగిరి సభ్యుల్

అనువత్సరకార్తికవన
ఘనోత్సవానసగమధురఖాదనభక్ష్య
ప్రణిపాతసమభితర్పిత
జనుఁ డెదురై వచ్చె నితఁడు సభ్యుల కంతన్

ఇద్దఱు కూఁతులతో ముస
లెద్దులతో రెండుగొర్ల కెచ్చనిమడితో
నిద్రాతనముతో నిలు
దిద్దుకొనున్ నాఁడితఁడు తియ్యనిచెలితోఁ

ఎన్నఁదగినకల్మియన్నది లేకున్న
మున్నితండు సల్పునన్నదాన
మన్నియూళ్ల పడలు విన్నది యూట ల
క్ష్మన్నమీఁద వారికన్న వ్రాలి

రాజులలో నధునాతన
రాజులు కొసరాజు లట్టి రమణీయగుణో
త్తేజితులు గాక మేమును
రాజుల మనువారు బొమ్మరాజులు గారే

ఇన్నఱి నీతని మెచ్చుచు
నన్నా! లక్ష్మయ్యా! కుశలమా నీకథలన్
విన్నారము కన్నారము
కన్నాకవు నీవ యీవిగలవారలలోఁ

అర్థిసాత్కృత మెవనిద్రవ్యమ్ము కాదో
జగతి కాతండ వేఁగు నాఁదగును గాని
యంబుధులుగావు, కా వరణ్యములు, తుహిన
కనకశైలాదికంబులు గావు బరువు

నిన్నటి ఝుంఝా ఝంపలు
మన్నగొనియె రొక్కఁతుత్రటిసి మనబడి నకటా
కన్నాఁడవె రా గమ్మని
క్రిన్నన విద్యాలయంబుకడకే సుకృతిఁ

తోడుకొనిపోయి బగ్గను
పాడై దయనీయమైన బడిఁ జూపి కడుఁ
వాడిన మొగములతో ని
ల్లాడిరి ధీనిధులు భావనాచార్యాదుల్

భావిపురాతనాద్యతనభారతగౌరవలబ్ధి కెల్ల వి
ద్యావిభవంబె మూలము గదా ధనధాన్యతురంగదంతిరా
జీ వగణీయసౌధమణిశింజితము లయ్యును విద్యలేనివా
రేవిధి రాణకెక్క చరియింతురు పెంతురు మానవత్వమున్

విద్య లేమిఁగాదె వేయేండ్లనుండియు
మోవరానిదాస్యమునకుఁ జిక్కి
పరితపించుచుండె భారతదేశమ్ము
తల్లి గోడు మాన్పఁదగదె సుతులు

దానమ్ములందు విద్యా
దానం బది ప్రథమగణ్యతం గను లక్ష్మి
యమ్మా! నీ వెఱుగని ధర్మమ్ముఁ
గానము, మేల్బంతి వీవు గఱువల కెల్లన్

ఈ పాఠశాలయే మగ
పాప సుమీ నీకు; దీనిఁ బరిపోషింపన్
వే పూను; ఇహాపరశ్రీ
నీ పాలం బడును త్రిభువనీపూజ్యముగన్

అనవుడు ని వ్వీరుఁ డల్లన నవ్వి
యో పెద్దలార! విద్యోన్నతులార!
యే నేడ నీచేత యేడ నావంటి
బడుగుమానిసి యింతబరువు పూను టేడ

నన్ను మన్నింపుఁ డన్నలు! సంతతార్థ
సంపన్ను లగువార సాయమ్ము గొనుఁడు
నాకుం దగిన కాన్క నన్నేలు ప్రభువు
లనుమతించినకాన్క నందింతు నెల్లి

నామీఁద సన్నసన్నని వాని మీఁదఁ
బెదపెద్ద యూసలు పెట్టుకో వలదు
గడువు పెట్టితి నంచుఁ గలఁతపాల్గాక
సెల వొసంగుఁ డటంచుఁ జేర గేహమ్ము

ఆనాఁటి రేయి నిద్రా
ధీనున శాస్త్రిక్యసేవధికి నిజపాద
ధ్యాన సుధాపాన మహో
లీన స్వాంతునకు మధురలిప్సానిధికిన్

ఈ లక్ష్మయకు యశోదా
బాలుఁడు సాక్షాత్కరించి భక్తశ్రీయో
లోలుఁడు దరహాసరమా
లాలితవదనంబుతోఁ గలం బల్కె నిటుల్

ఆపన్నంబగు పాఠశాలకయి సాయం బర్థిమై వేఁడఁగా
నాపై భారము వెట్టి వచ్చితివె యన్నా! నిన్నఁ బొన్నూరిలో ;
నీపావిత్ర్య మనన్యసాధిత మహో! నీ వొజ్జనై లోకపుం
బాపంబుల్ తెగఁజూడ నేర్తువని సంభావింతు నిన్ లక్ష్మనా!

వనసమారాధనంబు లవ్యారిగా నొ
నర్చి నను దన్పుచుంటి వీనాఁటిదనుకఁ
జాలు నిఁక నన్నదానముల్ చాలు నీదు
మదిని మగలింపు మొండొక మార్గమునకు

ఆధ్యాత్మికసంపత్తికి
విద్యయె మూలం, బెవండు విద్వాంసుఁ డతం
డాద్యపురుషు న్ననుం గని
యధ్యక్షించును విపశ్వరానందంబున్

నన్నెఱుఁగలేని మానవు
లన్నా ! పశుతుల్యు లట్టి యజ్ఞులఁ దెలుపన్
బన్నిన సంస్థకు నీకడ
నున్నధనం బెల్ల నొసఁగు టుచితంబు సుమా !

తన్నుమాలినధర్మంబు తగునె యంచు
నోహటిల్లకు నీ కింత యోగిరంబు
చిక్కదా లోకమునఁ జేను చెట్టు లేని
మనుజు లెందఱు లేరు ముమ్మాఱు తినుచు

ఆవంత సంశయింపకు
నీవం తీ కర్జమంచు నియమింతు హిమ
గాద్రివ దశకంఠపుర మ
ధ్యావని నీ కొండ్రి యుంట కనుమతిసేయన్

యాగాదులుం దనూజులు
సాగరముం బోని మేటిసంపద లమృతం
బీఁగలవా నిరవధిక

లే లె మ్మెవ రే పగిదిన్
గేలి యొనర్చినను నీవ గెల్తువు నా ప
ల్కాలము సేయకు, విద్యా
శాలోద్ధరణప్రియున్న శాలివి కమ్మా !

అని పల్కి తిరోహితుఁడై
చనె నఁట; యీసాధులోకసత్తముఁ డంతన్
దన వేల్పుం గొనియాడుచుఁ
గనుఁదెఱచెన్ సతికి స్వప్నగాథలు వినిచెన్

ఆ పడఁతుక యీ పురుషున
కేపుణ్యఫలంబొ "శంకర పేటికి బృందా
గోపాలుపన్ను శిగమున
నే వూనఁగదయ్యా ! మల్లెవిరిదండవలెన్"

అనుచు నాథుఁ దెల్పెనఁట ! యెంతదొడ్డయి
ల్లాలో లక్ష్మణాఖ్యఁ డేలువెలఁది
పొడమఁజాలునెట్లు పూర్వసంస్కారమ్ము
లేనిచాన కిట్టిలెస్సతలఁపు

ఏటి కని మగఁడు లాగినఁ
గోటికిఁ దా లాగి వానికుత్తుక కురియా
జోటికి నీమె సతీత్వము
మాటికి మాటికిని బుద్ధి మప్పఁగఁజాలున్

సహాధర్మచరీపద భర
వహానతమ రామమాంబ వాసచ్చరితం
బహారాద్యనిమేష ముహు
ర్మహురుద్దేయమ్మ విశ్వమునకాంతలకున్

పదపడి మనలక్ష్మయు డై
బ్బది యేన్గుల బలముతోడ బడిపనిఁ బూనెన్
బదియూళ్ళకుఁ గూడలియై
పొదలెడి యిచ్చోటు విలిచి పుణ్యాహమునన్

త్రివేంబునాదులు కార్మల
జీవ్వన రావించె నెల్ల జేపులు మాపుల్
నావేఱుఁగ కన్నిపనులం
దివ్యీరుఁడు పాలుగొనియె నించినవేడ్కన్

పాల మమ్మె న్నగ లమ్మెను
గలవస్తువు లెల్ల నమ్మెఁ గడ కిల్లమ్మెన్
మలమల నెండకు మాడుచు
లలిఁ జెట్టున కుట్టగట్టి లక్ష్యము గొట్టెన్

పదునాల్గువేల విత్తము
వెదపెట్టెఁ గదన్న దానవీరుం డితఁ డీ
సదనమున, కెన్ని విఘ్నము
లొదవిన నావంత సెడని యుత్సాహమునన్

కూలికి బండిం దోలుచుఁ
బాలికి మడిదున్నుకొంచు బ్రదుకుచు నున్నాఁ
డీ లక్ష్మయ నేఁ డోహో
హో లేరీదృశులు కర్మయోగులు జగతిన్

తన రక్తమాంసములతోఁ
దనసర్వస్వమ్ముతోడఁ దనిసిన బిడ్డన్
దినదిన మున్జూడక యీ
జనకుఁడు నిలఁజాలఁ డీ విశాలగృహమ్మున్

ఇతఁ డిచ్చు నింటితో ను
న్నతవిద్యాశాలయై తనర్చు మనీషా
చతురుల వెలయించుచు సం
స్తుతి గను నీబడి నితాంతసుందర మగుచున్

దేవుఁడుగా కీతఁడు నరుఁ
డా విశ్వజనీనవృత్తు లగు వా రెల్లన్
దేవపదవాచ్యు; లేవపుఁ
ద్రోవలఁ జనుమనుజు లెల్ల దూరక్షస్సుల్

* * * *

ఏ మనుకొంటివో నిడుఁబ్రో
లీమాన్యచరిత్రు నొకనినే కాదు గుణో
ద్దాములఁ బెక్కురఁ గని తన
నామము నన్వర్థముగ నొనర్చె వయస్యా!

రసికతకు నాశ్రయంబు నా రాణకెక్కి
కవులఁ దనియించి గాయకాగ్రణులఁ బెంచి
దానకండూతి కగ్గమై దీనలోక
సురభి యైనట్టి వేంకటసుబ్బరాయఁ
డిచటనే పుట్టె - నచ్ఛతాప్రచురభావ
భరితుఁడై పాండితీబలప్రథితుఁడై వి
గర్వియై నిజదేశవికాసకృత్ క్రి
యారిరక్షులుగాఁ దన యూరియువల
సంస్కరించిన జాపని సత్కులుండు
పౌఢమె నిచటనె యాంజనేయుఁడు - తెలుంగు
నేతలం దొకఁడై రాజనీతిలోఁతు
లెఱిఁగి యుత్తమపీఠంబు లెక్కి పెక్కు
వత్సరంబులు బ్రాహ్మనివాసమునకు
దీని కేలికయై యేతదీయపుష్టి
కారణంబై తనర్చినవీరుఁ డసమ
జిష్ణుతాభాసి వేంకటకృష్ణుఁ డింద
కలిగెఁ - బ్రాచీ ప్రతీచీ జగత్కళా స
మగ్రుఁడై త్యాగజీవియై మాతృదాస్య
దళనకేళీనిమగ్నుఁడై దైన్యగాఢ
తిమిర సంఛన్న సైరిక సముదయమ్ము
పాలి జీవనజ్యోతియై పతితసంఘ

ముక్తికై ప్రాణమానము లున్మదుపుగట్టి
నవ్యకర్షక శకకర్తనాఁ జెలంగు
భారత శ్రీవిధాత నాఁ బరఁగు వీరుఁ
డవతరించెను రంగనాయకుఁడు నిందె
నీ వెలుంగవో నిదుఁబ్రోలిచేవ దీని
బిడ్డలం దెంద తెందఱో దొడ్డవారు
కలరుకాని వా రొకరయేత్తు కలిమిలేక
చదువులే కిట్టి నెఱచేఁత సలిపినట్టి
లక్ష్మయాభిధుఁ డొకయెత్తు లక్ష లున్న
వాఁడు వే లిచ్చు టబ్రమావంద లున్న
పేద సకలమ్ము నిట్టు లర్పించుటన్న
నెంతయౌదార్య మజ్జారె! యెంత తెగువ!
యెంత ధర్మాభిరతి! సత్కృతీట ప్రబంధ
వస్తువై తెల్గునాఁటిలో వాడవాడ
లందు వీనిచరిత్ర పేరందవలయు

"శ్రుతులును బ్రహ్మవేత్తలును సూనృతవాదులు గోవులుం బతి
వ్రతలు నలుబ్బులె నెగడువార లుదారవదాన్యతా కళా
రతులున కాక యిమ్మహిభరమ్మున కెవ్వరు చాలువారు ప
ర్వతములు నేన్గులున్ఫణియుఁబందియు మోయుట నమ్మనయ్యెదన్"

"ధర్మజ్యోతి"

అని మున్ను నీవు మెచ్చిన
యనఘులయం దెన్నఁదగిన యతఁ డీతఁ డనన్
విని వీ్రడకు విస్మయమున
కనుతాపంబునకు లోఁగి యార్తింబడుచున్

ఇతఁ డింత యొప్పునే ఋషి
నతిమాత్ర పవిత్రతాసమంచితు వీనిన్
మతిలేక దూఱు నా కే
గతి కలదో మోవరానికలుషము వచ్చెన్

ఈతఁడు సత్కృప్రష్టుం
డీతండు మరుత్తుఁ డీతఁ డినసూను వహో!
యీతఁడు బలి యీతఁడు శిబి
యీతండు దధీచి పూజ్యుఁ డితఁ డెల్లరకున్

ప్రజలకొఱకు నిట్లు బలివోవు లక్ష్మణు
నూరు పేరు తడవఁ డొక్కఁడేని
లోక మెంత గుడ్డిదో కదా చెన్నంటి
వానిఁ బిలిచి పీటవైచి కొలుచు

నడిసన్న యే డ్తెఱన్ దన
యొుకలిన్ రణభూమి కిచ్చు నొసపరిబంటున్
నోడువ; దని కోహటించిన
పడవాల్ తలమీఁదఁ జల్లు బంగరుపువ్వుల్

ఇట్టివీరుల జగద్ధితకార్య మరసి
యంతుపట్టని జీవితావధుల్ దలఁచి
యాడంబరమ్ముల కలవాటువడని
మనుగడఁ గాంచి వేమఱు వాడవాడ
వెక్కిరింపకుఁడు గర్వితచిత్తులార !
సంపదల్ భోగముల్ చక్కఁదనమ్ము
లధికారమత్తత లఖిలదంభములు
ననివార్యమై పొల్చు నవసానవేళ
కొకనాఁడు తప్ప కాహుతియాట నిజము
ఓమరహంకారులో జనుపాంథు
లిట్టి జానపదాలి కెవ్వారు న్గుసుమ
హారముల్ నింపలేదని, కవుల్ వీరిఁ
గీర్తింపలేదని గేలిసేయకుఁడు
మీ రుపేక్షించు గ్రామీణులలోన
విశ్వైకతేజోఽగ్ని విస్ఫులింగములు
గమికొన్న హృదయముల్ కల వనేకములు
రాజదండము దాల్చి రాజ్యమ్ము లేలు,
జీవసారస్వత శ్రీవీణమీటు
మధురహస్తాలకు మాత్రమ్ము కఱవె
బ్రాహ్మీకటాక్షసంపత్తికీ ప్రజలు
దవ్వైరిగాని దుర్దాంతదారిద్ర్య

మేఁచి సాలశౌర్య మిచ్చెఁ గాని,
కల్పనార్ఘుని గడ్డకట్టెను గాని
యలఁతి వారా వీర లంతంత వారె?
మున్నిటిలో విశ్వమోహనచ్ఛవులు
పంచురత్నము లెన్ని పడియుండ లేదు
పరువమ్ము కమ్మకన్ పాడటిపోవఁ
గటకటా ! నిర్జనకాంతారవీథిఁ
బుష్పరాజము లెన్ని పొలియుట లేదు
మానవేంద్రుల రత్నమకుటముల్ దించు
నెందఱుతిమ్మున్న లింపు లే రడఁగి
యించుకంతయుఁ గీర్తి నెఱుఁగని మూఁగ
మానసులగు చిల్కముకొం కవీంద్రు
లీ ప్రజారాశిలో నెందఱు లేరు
ఉన్నారు వేలు వే లున్నారు గాని
యొక్కరు చరిత్రకే మహామహులు
లేమి కొందఱపేరు లేకుండఁజేసెఁ
గులము కొందఱపెంపు గోతిలోఁ ద్రొక్కె
మతము కొందఱరూపు మాపి యుప్పొంగె
నకటా ! గరీయాంసులగు వీరికొఱకు
నొక్క నిట్టూర్పు - నిట్టూర్పు - రానిండు -
రానిండు మీ పాపరాశి పెంపఱఁగ

అని శాఖాచంక్రమణం
బొనరిచి యే నింత సేతి యుడుగని తివుటన్
జన సేవా పరతంత్రు
మునివర్యుని లక్ష్మణార్యు మొగమున్ గనుచున్

నీచుల మెచ్చుట కెన్నఁడు
వాచవి లేనట్టి మతము వాఁడని వాణీ
వైచిత్రి వెలయఁ బరిపూ
తాచారుల నుగ్గడించునతఁ డని జగతిన్

నానుడి గల యేఁ నెచ్చట
నీ నిందాలాప మెచట నియ్యది గాలం
బై నా గుండెను దేవుచు
నానా వేదనల పాలొనర్చక యున్నె

వాచాదోషం బిది సెడ
మోచాఫలమధుర విశ్వమోహన చాటు
శ్రీ చిక్కణ మస్మత్కృతి
కీ చారుకథానిధాను నీవు నొసర్తున్

ఇట్లు నిశ్చయించి యీనాఁటి కానాఁటి
మాట మందమతిని మఱచినాఁడ
లోకమాన్యు నెవని నీ కావ్యభర్తఁగా
నాచరింతునంచుఁ జూచినాఁడ

వారినని వీరినని పెక్కు-వగలఁ దలఁచు
వేళ నొక నిద్రలో ధర్మవీరుఁడితఁడు
దర్శనంబిచ్చి మత్ ప్రమాదంబు తొలఁచె
నమ్ముఁ డిది సర్వథా సూనృతమ్ము బుధులు!

వినరయ్య! నాఁటికర్జం
బోనరిపంగంటి నేఁటి కోహో! తెలుఁగుం
జనులారా! యే మందురు
ననుఁ దద్దురితంబు వాయునా వాసినదా

రావయ్యా! కొసరాజు లక్ష్మణకృతీ! రావయ్య కబ్బంబు గై
కోవయ్యా! భవదీయ పావనకథాకూలంకషాస్నాతులై
శ్రీవాణీపదభక్తులీ కవిత సంసేవింతు రాంధ్రక్షమా
దేవీవత్సలతాపహారచణ పుత్రీపుత్రతౌ లాకల్పముల్

కాసుల కాసచెంది కృతికన్యల నమ్మక ప్రాజ్ఞకోటిలో
వాసిగడించినట్టి కవివర్యులు కానుక వెట్టు కబ్బముల్
మోసెడిభాగ్య మిల్లరకు ముట్టదు విశ్వజనీనశీలురై
భాసిలు నిన్నుఁబోని గుణభద్రులకే సమకూడు లక్ష్మయా!

ఇఁక నీకీర్తిజ్యోత్స్నలు
సకలాశలఁ బ్రాఁకి దిగ్గజము లవి యెల్లన్
బ్రికలై రావణభావ
ప్రకాశములుగా నమర్త్యపతి నాడించున్

నిన్నువంటివారె ప్రిన్నని నాకైత
నేలుచుంద్రుగాత! మిద్ధగుణులు
పసిఁడికొండ లంముఁ బసువులఁ గొండాట
వలవకుందురిగాక! తెలుఁగుకవులు

౧౫-౯-౪౩

# భారతసవిత్రి

వెన్నతోడన చతుర్వేదబుక్కులు పంచి
సుతుల కేజనయిత్రి చుంచు దువ్వె
త్రిజగంబు లస్యధా స్పృజయించు గడుసరి
కొసరి యేతల్లి చన్ గుడిచి తనిసె
తాలు నిత్తినచో వరాలగుత్తులు పండు
నవసస్యపై నేరాణి హాళ్ళ వడసె
పాత్రింబులగు నిహామాత్రిసంపద లిచ్చు
తటిను లేదేవిపూదండ లయ్యె
మూండుసంద్రాలు నగరాజు మోఁకటించి
యేమహాశక్తి నర్చింతు రెల్లదెసల
నమ్మహేశ్వరి కఖిలకల్యాణఖనికి
భారతసవిత్రి కగ్రైనె ప్రాంజలింతు

౧౦-౭-౪౦

# సంక్రాంతి

కొసరి నూఱిన పచ్చిపసపుఁబూఁతమొగాన
గుమ్మడిపూవుమారమ్ము నద్ది
కండగేగడ నారఁబండి కిన్పండు వై
పాలుచు మిర్యపుఁబంకు బొట్టు వెట్టి
వలిపమ్మునకు నొక్కువాసి హెచ్చైచనట్టి
నునుమంచుఁదెరచీర నూలుకొల్పి
బంతిపూవులకుఁ జేమంతినెయ్యము గూర్చి
కబరీభరమ్ముచక్కన కుదిర్చి

పంటకళ్లాలు మును బరాబరులు సేయ
గూఁడుగట్టిన తెలిమబ్బుగొడుగునీడఁ
గదలివచ్చెను భాగ్యాలకడలి వోలె
మకరసంక్రాంతిలక్ష్మి హేమంతవీధి

లేఁగటిపాలలోఁ గ్రాఁగి మాఁగిన తీయ
తీయకప్పురభోగిపాయసంబు
చవులూరు కఱివేఁపచివురాకుతో గమ
గమలాడు పైరవంకాయకూర

తరుణకుస్తుంబరీదళమైత్రిమై నాల్క
త్రుప్పు దుల్పెడి నక్కదోసబజ్జి
క్రొత్తబెల్లపుఁదోడికోడలై మఱిఁగిన
సుదురుగుమ్మడిపండు ముదురుపులుసు

జిడ్డుదేఱిన వెన్నెలగడ్డ పెరుఁగు
గరగరికఁ జాటు ముంగారుచెఱకురసము
సంతరించితి విందుభోజనముఁ సేయ
రండురం డని పిలిచె సంక్రమణలక్ష్మి

నెలదప్పినట్టి కోడలిచేత నొక యత్త
భోగిపొంగలిపూజ పూర్తిచేసె
పుట్టినింటికి వచ్చినట్టి కూఁతు గులాబి
చెక్కిళ్ళ నొకతల్లి చెనకి పుణికె
మాఱువడ్డించెడి మఱఁదలి కెంగేలు
పిసికి వల్దనె నొక్క పెంకెబావ
వంగి ముగ్గులు దిద్దు వధువుపై నీర్చల్లె
గది వీడిచను నొక్క గడుసుమగఁడు

అపుడె వచ్చిన ప్రియుని సోయగముఁ గనుచుఁ
దలుపుచాటున నొక్క పైదలి చెమర్చె
మధురమధురానురాగసామ్రాజ్యపీఠి
జగము కొలువుండె మకరధ్వజంబు నెత్తి

తొలిమేని దుష్ప్రపథము పండిన రోగి
మొట్టోయను కోలంది బిట్టబిగిసి
వసవల్చు పసిపాపదెస కేగి నీతికి
బాహిరంబైన దర్పంబు నెఱపి
దగ్గు ముక్కలతొంత వగ్గుఁదనము సూచి
గొనయమ్ము గనయమ్ము కొసకు లాగి
పంచాస్త్రు దయరాని బ్రహ్మచారులఁ దాఁకి
తోరహ త్రపములోని జోరు సూపి

పొగరుపొంగున దన్వంతబుద్ధి లేక
పొలయులుక చన్న తెఱపిజంటలు నెరచ్చు
కొంటెచలిగాఁడు కోయము కౌఁగింటిసెగలు
గటకటా ! మ్రగ్గిపోయె సంక్రమణవేళ

ఈ కోడిపందెంబు లేమి చెప్పెడినయా
ఆంధ్రజాతీయశౌర్యాభిలిప్స
ఈ రంగవల్లిక లేమి తెల్పెడినయా
తెలుఁగునారీకళాధీనబుద్ధి
ఈ గంగిరెద్దువాఁ డేమి పల్కెడినయా
మఱుఁగువడ్డ తెనుంగుమాట నేట
ఈ గొబ్బిసంబరం బేమి చాటెడి నయా
తసివిగొల్పెడు నాంధ్రధర్మభిక్ష

ఈ రుచిరపాయసాన్నంబు లేమి చూపు
తెలుఁగు లేజంట తొలుకారు వలపుఁ జవులు
వింత లాలికించు కలికిసంక్రాంతి నిట్లు
తెనుఁగుఁదన మింట నింట మూర్తీభవించె

ఉదయాస్తనగహిమక్ష్మాహ్వసేతువు లెల్ల
లగు మహీరాజ్యంబు నతికరించి
అఖిలప్రజావిస్మయాస్పదంబైన
బ్రహ్మచర్యాభిధానభార మూని
ధర్మేతరక్రియాతత్త్వబోధన సేయు
గురునైన హరునైన గ్రుద్ది గ్రుద్ది
అపరాజితోరుశస్త్రాస్త్రరోచిష్ణునై
రణకళానీతిగౌరవము పెంచి

పున్నములనుబుద్ధ నాఁ గీర్తి గన్న భీష్ముఁ
డంపసెజ్జను గాయంబు లప్పగించి
నీ యొడం గన్నమూఁత్తకై నెలలు సైఁచె
మకరసంక్రాంతి ! నీ వెంత మాన్యవమ్మ !

తట్టలుతట్టలే త్రివ్వి * సుంకులు వోసెఁ
బాలికేకలలో నొడల్ పుల్కరింప
పాలికట్టె నందియు మొలకనవ్వుల నిండు
కళ్ల మిచ్చెను జీతగానికొఱకు

* గ్రామదేవతకు నర్పించు ధాన్యము

వెలసూఁచి చిఱుఁదిండి పిలిచెనా కొబ్బెర
చిప్పకే చేటలుచేట లొసఁగె
గాజుల కని కోరఁగా గంప కెత్తించి
పాలేరుసతికి సంబరము గూర్చె

కుంటికిన్ గుడ్డికిని వేఁడుకొన్నవాని
కెల్లవానికి భాగంబు లేర్పరించి
లేము లెఱుఁగని సంక్రాంతిలేమ కపుడ
నంగుఁదోడయ్యెఁ గుప్పలు నూర్చురైతు

లేఁబొట్టతోఁ బిసాళించు నాముసకు న
క్కోరుదూడలు వెండికొండ లయ్యె
నిముసాన కొకసారి నిండుసత్తుయపాత్ర
గాసిచే సాతాని గజ్జెవిప్పె
కల్లుపెల్లాని రంగము పెట్టెఁ గాకలీ
నాదమ్ముపంట యోనాదిజంట
ప్రాఁజీర విడి మాలపడఁతి క్రొత్తలు దాల్చె
సూచించె శిశిరర్తుసుదతిరాక

క్రొత్తకుసుమాకూడు కుత్తుకబంటి గా
బిచ్చగానికుక్క పెచ్చరిల్లె
చేవ తనివి వేడ్క చెలువంబు కావరం
బగ్గలించె నుత్తరాయనమున

౧౪-౧౨-౪౧

# ఆదర్శవీరుఁడు

అది మొగల్ పాదుసా యౌరంగజేబు రా
    జ్య మొసర్చు పదియునేడవశతాబ్ది
అది భారతీయదాస్యాంధకారపరిభల్
    దోఁబూచు లాడెడు దుర్దినంబు
అది పరస్పరమైత్రి యుడుగంటి హైందవుల్
    లోలో నెదుర్చు దుష్కాలఘటిక
అది స్వాభిమానరక్షార్థమై బెదరి హిం
    దూ మతం బల్లాడు దుష్కరహూర్త
మది నిజకుమారదైన్యదశావలోక
జనిత సంతాపపావకజ్వాలికా వి
తప్తమానసయై భారతంపుజనని
వేఁడికన్నీరు గార్చెడు విసపుఁబ్రొద్దు

మతవిద్వేషము హెచ్చి సిక్కులు ముసల్మానుల్ విజృంభించి వి
షితశౌర్యం బనివార్యవీర్యము రణక్షోణిం బ్రదర్శించి క
ల్పతరుప్రాంతలతాకుటీరగత రంభామేనకాద్యప్సర
స్సతతాలింగనభోగభాగ్యకలనా సంతుష్టులై రత్తఱి

ఈడంబోవని మగఁటిమి
తోడన్ బెక్కేఁడు లెదిరి తుద కొక రణమం
దోడిరి సిక్కులు; తురకలు
పాడిరి జయగీతములు నభం బ్రదువంగన్

చిక్కెం గాలవశంబున
సిక్కుగురూత్తముఁడు సర్వసేనాపతి పే
రెక్కిన తేజబహద్దరు
దిక్కుల్లఁ జెడన్ మహమ్మదీయులచేతన్

మలక లతనిం గదుంగడుఁ
గులుకుచు బంధించి విజయకోలాహలముల్
బలియు న్గొనిచని సిల్వరి
సలాము లొనరించి పాదుసాకట్టెదుటన్

సంతోషాంబుధి నోలలాడుచుఁ బ్రశంసంజేసె నౌరంగజే
బంతేని న్దనవారి; నంతట నహో! యివ్వారు లెవ్వారు దు
ర్దాంతాహంకృతులైన సిక్కుదొరలా తథ్యంబు! వీరేలమా
చెంతం జేరి రటంచు నమ్మగని నాక్షేపించి యిట్లాడెడిన్

పొగ రెగసి మొగలు వీరుల
మగఁటిమి గనవైతె వింతమాత్రియు నౌరా!
తగరు నగరాజు నెదిర్చిన
పగిదిం జరియించి తింతవట్టు వెడంగా '

చిక్కితిపొ దక్కితిప మొగల్ సింగమునకు
నేఁటి కిటు వంటయింటికుందేల వైతి
బహాదరూ! దిక్కుమాలినపక్షి విప్పుడు
బ్రతుకుపై నాసయున్న నాముదల వినుము

నా కనుసన్నల మెలఁగుము
నా కొల్వు న్గొలిచి యున్నన ల్గాంచుము నా
మూఁడకు నొక్కటి కేలిక
వై కనుమా నిస్సమాన మైన యశంబుఁ

కాదనక సిక్కుమతముఁ
బోఁదోలుము మన్మతంబు భూషింపు ॥ నా
యాదరమున వర్ధిల్లుము
లేదా చచ్చేదవు జాలిలే దీతనికిఁ

నాఁపుడు సిక్కుదంట చిఱునవ్వు మొగంబునఁ దాండవింప ఢి
ల్లీ విభుతోడ నిట్లను బళే! యవనాధప! నీ వివేక మీ
తీ్రవలఁ బట్టుటొప్పునె! విరోధి వశంగతుఁడైన వేళ నే
యే విధి నాడఁజెల్లు నొకయింత యెఱుంగ విఁకేమి సెప్పుదుఁ

మీసము దువ్వి శాత్రవులమీఁదికి దూఁకుమగండు విక్రమో
ల్లాసవిభాసియై రిపుబలంబుల నొక్కపు డోర్చు, నొక్కచో
గాసికిఁ జిక్కఁగాని నిజగౌరవనాశకవృత్తి కాతఁ డె
ట్లాసపడంగ నేర్చు వినవా కనవా మొనగాండ్రచెయ్దముల్

మతమునెడ విజ్ఞుఁడు బలా
త్కృతి సల్పునె యది మనుష్య నిచ్ఛావశమా
ట తగదె యాస్తిక్యముగల
మత మెయ్యది యైన సుజనమాన్యముగాదే

విశ్వవిఖ్యాతసభ్యతావిలసితంబు
భారతావని ధర్మంబుపట్టుఁగొమ్మ
నీకు నెలవు గదా! యేమి నేర్చితిందుఁ
గమలసౌరభ మది యెంత కప్పు తెలిసె

దుర్వారప్రథనక్రియాచతురతాదుర్గర్వులై మించు మా
పూర్వుల్ పెక్కురు దేశమాతృచరణంబుల్ చిత్తమందూనియీ
యుర్విన్ గార్చినరక్త మిప్పటికి నోహో! యింకి పోలేదు నీ
గర్వోక్తుల్ ఫలియింపఁజాలునె వివేకం బున్న నూహింపుమా

చచ్చెదు సచ్చెదంచుఁ బలుసారులు హెచ్చరికించె దేల యీ
చచ్చుటకై భయంపడి విశాంపతు లెల్లరు నవ్వ నేఁడు నీ
బిచ్చము నిచ్చగించి రిపుభీకరభారతజాతి కీర్తిఁ డే
మచ్చయుఁ దెచ్చిపెట్టెదుసుమా! విడువందగు నీప్రలాపముల్

చావనివాఁ డెవండు జితశత్రులు సప్తసముద్రముద్రిత
క్ష్మావలయాధిపత్యపరిసర్పితకీర్తులు చక్రవర్తు లే
రీ వచియింపు; కీర్తి యొకండె యమరత్వము గన్నదోయి త
త్సేవకె ధారవోయుదురు జీవము భారతవీరశేఖరుల్

చిక్కినవానిఁ బట్టి వధసేయుదు నందువు దానిఁ దీర్ప నే
ముక్కిడిసాలఁ డోయి బలమున్ మగపాడియు నున్న దేని పే
రెక్కినకత్తి నిచ్చి యిపుడే యెదిరింపుము నన్ను నీకు నా
సిక్కుఁదనంబునంగల విశేషము సూపెద నొక్క వ్రేల్మిడిన్

నెఱి మువ్వొకో సిక్కుల ని
స్తులధైర్యస్థైర్యశౌర్యధుర్యాహవకలా
బలలబ్ధయశఃపిహితా
ఖిలదిక్కుల భారతోర్వికి నలంకృతులన్

ముప్పదికోట్లమానవుల మూర్ధములన్ దనసేయుశాసనం
బెప్పుడు సిల్పఁగోరు ధరణీశుఁ డిటుల్ నయబద్ధపద్ధతిన్
దప్పిన, వానిరాజ్య మయథాతథమై సెడకున్నె వానికిన్
ముప్పులు పెల్లురేఁగి తలమున్కలుగావె మదిన్ దలంపుమా

కూర్మితనూఁది నీ విపుడు కోసెదు నాశిర ; మంతమాత్రఁ జే
కూరదు నీకు సంతస మకుంఠితశౌర్యులు సిక్కుజోదు లీ
వీరుని నేతృచుక్క కొక వేవురుపుట్టి మొగల్ప్రభుత్వధా
త్రీరుహమున్ బెకల్తురు గరిష్ఠులు కుంకటివేరు లూడఁగన్

నిచ్చలు గుండెగాల మయి నిన్నుఁ గలంచు మగండు నేఁటితోఁ
జచ్చెను జచ్చెనంచు నిఁక సంబరమంద కతండు రేప తా
వచ్చు రణోర్వి కొక్కవరవర్ణినిగర్భమునుండి మార్తురన్
గ్రుచ్చు నిశాతభల్లమునకున్ జయలక్ష్మికవుంగిలింపఁగన్

వీరాగ్రేసరు లిద్ధతేజులు జగద్విఖ్యాతకీర్తుల్ మహో
దారుల్ భారతపుత్త్రు లాత్మజననీదాస్యంబు మాయింప దు
ర్వారోత్సాహమునన్నిజాంగములు త్యాగప్రియంబుగా నిత్తు రీ
ధీరోదాత్తచరిత్రు నీకు నిప్డు జేఁ దెల్లంబు గావించెదన్

ఉక్కున్ జిక్కటి పిడిక
యొక్కటియై నిక్కిపడుఁ జిప్పాఘఁ బల్కన్
మొక్కలమున కంతముఁ జే
రెక్కిన యమ్మానవేంద్రుఁ డెంతయు నల్కన్

తోఁకందొ్రక్కిన నాగుఁబా మగుచు హుస్సుల్ మ్రత్తి, కన్నుంగవన్
మూఁకల్ మూఁకలు విస్ఫులింగములు నిర్ముక్తంబులై క్రాలన
స్తోకస్థైర్యుని భారతీప్రియసుతస్తోమాగ్రణిన్ బాహుయు
శ్రీకందమ్మును నిక్కిపడుఁ గబళించెన్ బెంచ సుకీర్తులన్

౧౦–౮–౩౯

(భగత్‌సింగు నురితీసిన సమయము)

# గురుదక్షిణ

చిక్కని సిక్కునీగు మగచేవమెయిన్ రణ మిమ్మటంచుఁ దాఁ
జక్కటి సూప కమ్మొగలుపా పరుషక్రమమూఁది వాదరన్
ముక్కలుచేసియున్ బ్రమదముం గనఁజాలక పూతిగంధముల్
గ్రక్కుచుఁ గుళ్లి కుళ్లి చెడఁగావలె పీఁడని యెంచె నీసునన్

ఆతనిపన్నిన భటులు ప
రేతక్షితి శవము నిల్పి రేయుంబవలున్
జైతన్యముగల పీనుఁగు
లై తమధర్మంబు నడుపు నాసల నుండన్

ఒక్క ముహూర్తములో నిది
పొక్క నమృతసరములోన; బోరన సిక్కుల్
వెక్కిరి లేటమొగమ్ములఁ
జిక్కిరి పరిభవదవాగ్ని సిగల సెగలకున్

ఒక ముసలిసిక్కు గురుభ
క్తికి లోఁగినసాదు వగలఁ దెరలెడి తన వా
రికి నిట్లు వల్కె నెత్తురు
తుకతుక నుడుకెత్తి పొంగి తొందరపెట్టన్

పగఱకు నోహటించి నగుఁబాటునబ్రుంగుటగాక లోకముల్
పొగడిన మేటిజోదు గురుపుంగవు మ్రింగుటగాక గెల్పులో
సొగసినశత్రు లట్లు తెగఁజూచియుఁ దత్కృణాపంబునిమ్మెయిన్
దెగడుట సమ్మతింతురె నుతింతురె శూరులు మీచరిత్రముల్

పోవలయును గురుశివముఁ
దేవలయును సిక్కుమతవిధిన్ మఱుపఱుపం
గావలయును సత్కీర్తులు
రావలయును మనకు నిహపరంబుల రెంటన్

రాచపట్టువు గన్నవారలకు నిట్టి
తరుణము లఖండపుణ్యలబ్ధములు గావె
నీచముగ నింటఁ దెవ్వులుచే నీల్గనేల
నడుముగట్టుఁడు గురునిబుణమ్ము నీఁగ

* * * *

నే వెడలెద నే వెడలెద
నే వెడలెద నన్నరవళి నిండెను సభలో
నే వానిభాగ్య ముఱవో
దైవ మెఱుఁగు నంచు వృద్ధు తనివోయె నెదన్

పుత్రుని గూడి కోడియులఁ బూన్పిన కంచర మెక్కి నిర్భర
తూత్రము సందడింప నొకసైరికుఁ డెల్లర కంటె ముందె మ
ద్గాత్రము నేఁడు ధన్యమవుఁగా యని పొంగుచు హస్తినాపుర
క్షేత్రము సేరె నన్నసన చీకటి దాఁగురుమూఁత లాడఁగన్

హైందవుఁ డెవ్వఁడో తెలియు నాడినజాడలు పట్టి సంశయ
స్పందితచిత్తుఁడై యొలికిపట్టున కల్లన సేరి కాపరుల్
సందడి మాని నిద్రకు వశంపడినంత ముసుంగుచాటునన్
గందిన గాజునాటిన జగామగసిన్ గుఱుతించె సద్గురుఁ

వీరలఁ గన్మొఱంగి పదపిం బడినంతన కార్యఖడ్గముల్
తీరవు కాపువాండ్రు తెలతెల్లగ వేగిన వెన్క నాగ్రహో
దారత వెంబడింతురు గదా మనవజ్జవనాశ్వకోటిపై
బారులుదీరి; నట్టిలిని పాపము తక్కులు లేని సాధువుల్

ఈ దుష్పటి మఱువున గురు
పాదులమా ఱొండుపీన్గు పడియుండినచో
మీఁదెల్ల రుద్రవిఘ్నో
త్పాదనమై వెలయుఁ గీర్తిఫలసాధనమై

కొడుకా! ధైర్యము జీవగఱ్ఱ యనుపల్కుల్ పల్కి వెన్వెంటనే
బెడిదంబౌ నడిదంబుదూసి తనుఁదా భేదించె, రోమాంచముల్
వెడలెన్ దివ్యులమేన, నందనవనాపిర్యాభతముల్ క్రొవ్విరుల్
జడిమైముంచెను సిక్కుదైతు నఖిలాశల్ తెల్విఁజెల్వొందఁగన్

# ఉద్రేకము

సేనలతోడ నవ్వెలమసింగ మభంగురసంగరోత్సవ
శ్రీనిధి బ్రహ్మనాయఁడు విశిష్టచరిత్రుఁ డవార్యవీర్యస
మ్మానితమైన తేజము సమానుషపౌరుషమున్ వెలుంగఁ దా
నా నలగాముతోఁ దొడరి యాజి నొనర్పఁ దలంచి పోవుచున్

అంతిపురంబునంగల కులాంగనలం బరిరక్షసేయ దు
ర్దాంతబలప్రతాపసముదగ్రుఁ గుమారుని బాలచంద్రు ధీ
మంతులు ధైర్యవంతులన మంతున కెక్కిన వానినెయ్యురన్
దంతివిరోధివిక్రములఁ దా నియమించి రణోర్వికిం జనెన్

నిజభుజశక్తి చూపుటకు నేఁడుగదా! తఱి యయ్యెనంచు న
క్కజమగు సంతసంబు నెదఁ గాంచెడు బాలున కీయనుజ్ఞ దుః
ఖజనకమయ్యె, నైన జనకప్రతివాక్యము గూడదంచుఁ దా
గజిబిజి మానియుండెఁ జెలికాండ్రురతో నల వీరమేడపిన్

మేడపిలో నతండు తన మిత్రులతో నొకనాఁడు బొంగరా
లాడఁదొడంగ వీటఁగల యంగన లెల్లరు నేగుదెంచి యా
వేడుక సూచుచుండి రల వీరులయాటలలోని నేర్పు గొం
డాడుచు బొంగరాలఁ గొనియాడుచుఁ బాడుచు గుంపుగూడుచున్

పంబినవేడ్క నత్తఱిని బాలుఁడు ద్రిప్పుచు పైఁడిబొంగరం
బంబఁ మఱన్ దిగంతములునార్వఁగ "రంయి" మటంచువచ్చి విం
తం బాడఁగాంచుచున్న యొక తపస్వికి నన్నమ కజమీఁద నా
టం బొలివోసి వేగమున డెప్పరమంచు జనంబు లాడఁగన్

అయ్యెఱిది వేటు గొని "య
య్యయ్యొ చచ్చితి"నటంచు నన్నమ్మ వడిన్
నెయ్యంపుఁజెలులు చెవులన్
జయ్యన మూసిరి విచారసంతాపములన్

అంతఁ గొంతవడికి నయ్యంతి లేచి దు
రంతరోషకలుషితాత్మ గాఁగుచు
మొనసి మొప్పె నంచు మాఁకుళితహస్తుఁడై
మ్రోల నిలిచియున్న బాలుఁ జూచి

"కేచరాన్వయులైన వెల్మదొర లుర్విన్ జండకోదండ వి
ద్యాచాతుర్యము మీఱ శాత్రవకులధ్వంసంబు గావించి ధ
ర్మాచార్యత్వము నంది పేర్వడసి రిట్లన్యాయ్యమార్గంబులన్
నీచారంభములం బొనర్పరుగదా నిర్భీకులై యెన్నఁడున్

కలన నిశాతహేతుల నఖండవిరోధివరూధినీ శిరో
ధులఁ దెగవ్రేయఁబోవ రణమూర్జయులౌ దొర లెల్ల, నీ విటన్
గులుకుచు సిగ్గుమాలి మఱిఁ గొంకక జంకక బొంగరాలతోఁ
జెలువలపాదపద్మములఁ జెండెద విస్సిగో! రాచబిడ్డవై

కలదో కో నీకుఁ బౌరుషము కల్గినఁ గారెమపూఁడి సేరి నీ
దళములఁ గూడి శత్రువసుధాపతిసేనల నుగ్గుసేసి దో
ర్బలమును జూపి తేని మగపాడికి మెత్తురు లోకు; లిట్లు దు
ర్బలలగు నింతులన్ జదుమఁబాల్పడినన్ నినుఁ బ్రువ్వఁదిట్టరే

మీసము దీటి శాత్రవులమీఁదికి దూఁకఁగ శక్తిలేక సం
త్రాసము చెంది పందవయి తండ్రులకీర్తికి మచ్చఁ దెచ్చి యే
దోసము లేని చానలకు దోర్బలముం బ్రకటించుచుంటి వి
స్సీ! సరివారిలోనఁ దలయెత్తఁగ నీమన సెట్టు లొప్పెడిన్

అని తెగడుచున్న వైశ్యాం
గనపలుకులు ములుకులట్లు కాఁడిన, మది న
గ్గుణనిధి కినుకం జెందక
వినయంబు నయంబు వెలయ వెలఁదికి ననియెన్

“తల్లిరో! బొంగరంబు నిను దైవవశంబునఁ దాఁకెఁగాని నా
పల్లిదమోటు? గాటమగు బాధకు నోరువలేక శోకమున్
వెల్లువలోపలం బడి వివేకముఁ గోల్పడి నన్నుఁ దిట్టుదే?
కల్లనిజంబులం గనమి కర్జమె? నీమదిలోఁ దలంపుమా

దోషంబో! పొరపాటో! య
దోషమొ! నేదోషి నన్నుఁ దోఁచినఁ గడుసం
తోషంబున మన్నింపుము
రోషంబును బూని చానరో! తిట్టకుమా!

అని యవ్వెలంది గాయం
బునకుం దన మేలిపట్టుఁబుట్టంబును గ్రి
క్కునఁ జించి కట్టు గట్టెను
వనితకు మందులకు నూఱువరహా లొసఁగెన్

ఇచ్చి యచ్చెల్వ నింటికేఁ బుచ్చివైచి
మాటపాటలఁ జాలించి యనుఁగుఁ జెలుల
నన్నపోతాదులం గాంచి యాగ్రహంబు
దుఃఖమును సంభ్రమంబుఁ దోడ్తో జనింప

"గండరగండవై యలవు గంటును మెండుగఁ దాండవింప ను
ద్దండవిరోధికాండముల దర్పమునన్ విదళించి మించుచున్
గొండలఁ బిండిసేయఁగల క్రొవ్వలి కట్టి యవస్థ వచ్చె నీ
ముండకుఁ జుల్కనైతిఁ గద మూరినదుర్విధి నేమి సెప్పుదున్

రోసములేని పందనని రోయుచుఁ గోమటివీరకాంత నన్
గూసినకూఁత లెల్ల ననుఁగుంజెలు లందఱు వింటిరే? యిఁకన్
మీసము దువ్వి శాత్రవుల మింటికి గెంటక యింటనున్నచో
వీసరవోవకున్నె మన విశ్రుతపౌరుషవీరసంపదల్?

నిరుపమ విక్రమక్రము లనింద్యులు నాఁ బలనాఁటి వీరశే
ఖరులు ప్రసిద్ధిఁ గాంచిరి యఖండయశోనిధులై వెలుంగు న
వ్వురుషులలో నొకండనయి పుట్టి కృపాణముఁ జేతఁ బట్టి సం
గర మగుచో నిట న్నిలువఁ గాంతలు నవ్వుట వింతయెట్లగున్

ఈ పలునాఁటిసీమ జనియించిన వీరవరేణ్యుఁ డీలప
దూర్వవిలాసవిక్రమనిరూఢచరిత్రుఁడు నేఁడ కామధా
త్రిపతి గుండె జల్లుమనఁ దెప్పరియై రణసీమఁ జేసె మీ
రోపిన రండు చండరిపుయోధశిరంబులబంతులాడఁగన్”

వీరరసోద్రేకంబున
నీరీతి నతండు పల్కఁ, హెచ్చినవేడ్కన్
ఘోరాహవప్రయాణ
ప్రారంభము చెంగలించి బాలుని మిత్రుల్

“ఓపిన రండటంచు మము నల్లసమాడఁగ నేల బాల! మా
యోపిక లెట్టివో! తెలియవో! వినవో! పెఱవారమో! యశః
ప్రాపణమైనఁ జావయినఁ బాయక నీ వెనువెంట నుండుటయే
మాపని గాదె భీరువులమాడ్కి మముం దలపోయు టొప్పునే”

అని బాలచంద్రుతో నా
డిన విని యుర్వీశుఁ డనుమతించిన శౌర్యం
బున వారిఁగూడి తగు దీ
వనలం గొనఁ దల్లికడకు పడివడి నడిచెన్

౮-౧౦-౨౭

# వీరధర్మము

[ బాలచంద్రుఁడు రణమునకుఁ బోవు తలంపు
వెలువరించినతఱిఁ దల్లియగు నైతాంబ ]

అక్కట కుమార! నీ కెవ
రిక్కాగిణీ బోధచేసి రీ వెక్కడఁ బో
రెక్కడఁ బౌరుష మెక్కడఁ
జెక్కిలి నిటు మీటఁ బాలు చిందెడి నీకున్

బంతులాటగాదు బలిచెడుగుడుగాదు
బొంగరాల విసరుభంగి గాదు
గోలిగుండ్ల నాడికొనుపక్కిగాదు సం
గరము తెగగుపోగు కాదు తనయ!

హుంకారము లాశుగధను
ష్టంకారము లార్భటులును జంకెనలును బల్
అంకెలుఁ బొంపిరివోయెడు
సంకులసమరోర్విఁ నిల్వఁజాలుదె తండ్రీ!

మదగజఘీంకృతుల్ తురగమండలి హేషలు భేరిభాంకృతుల్
రథగణనేమిఘంధణ లరాళకరాళకృపాణజాఁఝుళల్
గుదిగొను సింహనాదము లకుంఠితభంగిఁ జెలంగ సాధ్వసా
స్పదమగు యుద్ధరంగమున బాలుఁడ వీ వెటు నిల్తు సెప్పుమా

కత్తుల తళతళలకు నీ
చిత్తము కంపింపఁ గనులఁ జీకటి క్రమ్మన్
దత్తఱపడువడిఁ బగ ఱొక
మొత్తమ్మున్ ముట్ట నెట్లు మొత్తెదు వారిన్

యుద్ధము లొనర్చి దేశంబు నుద్ధరించి
జాతికిం గులమునకు విఖ్యాతి దెచ్చి
మమ్ము నలరింప భావికాలమ్ము లేదె
తరుణ మిదిగాదు మాను మీతలఁపు గుఱ్ఱ!

సంతతి లేక కడుంగడుఁ
జింతిలిచింతిల్లి చిట్టచివరకుఁ జెన్నం
డింత దయ సూపి నిన్నని
సంతసపడితిన్ ఫలించె జన్మం బనుచున్

నానిధానంబ వీవు నా ప్రాణ మీవు
నన్ను నెడఁబాసి పోయెదే నాయ మెడసి
తగవుగా దీప్రయాణంబు తగదు తగదు
విడువు సంగ్రామవాంఛ నో వెడఁగుఁగుఱ్ఱ!

నీతండ్రి రణోద్రేకిఁ జన
నాతో డీ వుందు వనుచు నమ్మితి నెదలో
నోతండ్రి! నాకడుపునం
దీతఱిఁ జిచ్చిడకు మేటి కీ సాహసముల్

ఆలింపుము నాపల్కులఁ
జాలింపు మహాయజనక సంగరయాత్రన్
దూలింపుము రోషం బన
బాలుం డిటు లనియె ధర్మపరవశుఁ డగుచున్

వెఱఁగయ్యె నీదుపల్కుల
తెఱఁగుం బరికింపఁ దల్లుఁ దెఱవను నెఱపో
టరియగు బ్రహ్మనపత్నికిఁ
బిఱికితనం బిట్లు వెల్లివిరియందగునే

బాలుఁడవంచు సంగరముభంగు లెఱుంగనివాఁడ వంచు గు
ఱ్ఱా లిగిలించినంతనె కరంబు భయంపడె దంచు నా కహో!
శీలనినీతులం గఱపఁబోకుము వైరివిదారణక్రియో
ద్వేలయశస్కుఁడౌ వెలమవీరశిఖామణి నేఁ డెఱుంగుమా!

బాలుఁడు గాఁ డితండు యువపట్టము నేలెడుదిట్ట యౌవన
శ్రీలలితుండె సత్క్రియలఁ జేయు వలంతి యతండె దుస్స్థితిన్
దీలుపడంగఁ దోలి నిజదేశసముద్ధరణం బొనర్పఁగాఁ
జాలినమేటి వాఁడె పటుసాహసదోహలుఁ డూహ సేయఁగన్

కొండలఁ బిండియొనర్చెద
దండధరుండన విరోధిదళముల నెల్లన్
జెండాడెద వ్రేల్మిడి బ్ర
హ్మాండంబులఁ బట్టి బంతు లాడెద జననీ!

కారేమవ్వాఁడి రంగమునఁ గయ్యముసల్పఁగఁ గాలుదువ్వుచు
న్నారు తెలుంగుజోదు లదనన్ గదనంబున దూఁకి మూఁకలో
వీరవిహారము ల్సలిపి విశ్రుతకీర్తి గడింపకున్న నా
పేరును బెంపు సొంపు చెడఁ బెద్దలుఁబిన్నలుఁబ్రువ్వఁదిట్టరే

జనకుం డాహవభారము న్నిజభుజస్కంధంబునం దాల్చి తీ
అనికష్టంబులఁజిక్కి స్రుక్కుతఱి ధైర్యస్థైర్యవిభ్రాజి యా
తనయుం డెవ్వఁడు రాణివాసములఁ జింతంబాసి వర్తించు నో
జననీ! వేగ ననుజ్ఞయిమ్ము సముగ్రోత్సాహంబు తీండ్రించెడిన్

ఆహవమున కిప్పుడ చని
దోహలమునఁ గసిమసంగి దుష్టవిరోధి
వ్యూహంబులఁ దుంచెద నా
బాహాబలమెల్లఁ దేటపడు చందమునన్

తెలుఁగుం దేశచరిత్రకుఁ
జెలువిచ్చు సువర్ణవర్ణచిత్రములు నై
పలునాఁటివీరగాథలు
విలసిల్ల నొనర్తు నారవిసుధాకరమున్

గత్యంతరంబు సెప్పకు
మత్యంతోత్సాహమలర నాజి "యశోవా
మృత్యుర్వా" యని దూఁకెద
నిత్యంబగు నసము దేసల నింపెదఁ దల్లీ!

వెలమలు కమ్మవీరు లలవిప్రకుమారులు రెడ్డిజోదులుం
దెలఁగలు దేశదాస్యమును ద్రెంప విరోధిశిరోధిఖండనో
జ్జ్వలకరవాలహస్తులయి సంగరలక్ష్మి నలంకరింప నఱ్
నిలుపఁదలంచె దిందు జననీ! నిను నే మనువాఁడఁ జెప్పుమా

స్వార్థనిరతుండు తుచ్ఛభోగాభిరతుఁడు
పాఱుఁబోతు దేశద్రోహి పైసిమాలి
మూలడాఁగిన డాఁగుఁగా కాలమునకు
దూఁక కెవఁ డుండు నిత్తఱి వీఁకతోడ

నీ వెఱుఁగని ధర్మంబులు
లే వైనను బుత్రమోహాలీనాత్మకవై
యీవిధిఁ బల్కెదు, తమముం
బోవిడువం దగిన యదను పో యిమ్మది తల్లి!

పుత్రుఁడని మిత్రుఁడనియుఁ గళత్రమనియు
భర్తయని సోదరుండని బాంధవుఁడని
బాలుఁడని వృద్ధని తలంచువేళ గాదు
తల్లిరో! సాగుచుండె స్వాతంత్ర్యరణము

శరికర్ణాంతవిలోలము
శరీరము తడిత్సమంబు సకలార్థంబుల్
సరసీరుహాదళగత శీ
కరములు భోగములు వీనఁ గాంక్షలు దగునే

కాయం బనపాయము గా
దోయమ్మరో! కీర్తిమాత్ర ముందును గవిరాడ్
గేయంబై యాచంద్ర
చ్ఛాయానాయకము దశదిశావ్యాప్తంబై

వీట నున్నను గాటంపుఁగాట నున్న
మిత్తి నెదిరింప నెవనికి సత్తి గలదు
ఉప్పతిల్లుచుఁ జెల్లుచు నుండుఁగాని
యెల్లప్రొద్దులు నొక్కమే నెట్లు నిలుచు

బ్రదికిన నాల్గుదినంబులు
నదిరా యని జగము మెచ్చునటు పౌరుషసం
పద పొంపిరివోవఁగ నుం
డఁదగు నన్నరుఁ డంచు బుధు లన న్వినవొక్కొ

"ఆరయ వివృతస్వర్గ
ద్వారము రాజులకు నాహవం బంచు మహో
దారుఁడు శాంతనవుఁడు తా
భారతసంగ్రామవేళ భాషింపఁడొకో

అమ్మరో! వీరసింహముల కాహవరంగ మొకండె వాసయో
గ్యమ్మగు కాననం బచటఁ గాయముఁ బాసినఁ బాయకున్న సౌ
ఖ్యమ్మన కించుకంతయును గల్గదు లోటటకేగలేని ద
ద్దమ్మలు భుక్తిముక్తులకుఁ దప్పుదురం, చనరొక్కొ పండితుల్!

తను వస్థిరంబు గావున
మనుజుం డనయంబు నప్రమత్తతతోడం
బూనరింపం దగు మృత్యువ
దనసదనావాసి పోలెం దనధర్మంబుల్

ఉత్తమమగునరజన్మం
బెత్తిన ఫల మేమి సుగతి కేగెడుమార్గం
బెత్తోయంబునం గానక
మత్తిల్లి చరించునతండు మాతరొ చెపుమా!

మాతృదేశం బన్యమనుజేశ్వరునిచేతం
జిక్కి స్వాతంత్ర్యంబు దక్కి తనదు
జాతీయతను బాసి చేతోగతంబైన
తలంపు వెలువరింపం దగినహక్కు
నెడసి లోలోపలనే కుళ్లి కుములుచు
నీచదాస్యమున మునింగి పిఱికి
తనము వరించి నితాంతకష్టపరంప
రల నీంగి దారిద్ర్య మలమ దిక్కు
లేక శోకించువేళం దల్లి మొఱ నాల
కించి మై పులకింపం జలించి కొంచె
మేని నామెకుం దోడ్పడ లేనిబిడ్డ
బ్రతుకదేటికి ధాత్రికి బరువుచేటు

౧-౧౦-౩౦

(ఉప్పు సత్యాగ్రహ సమయము)

# తెల్గుకాంత

నేలనాల్గుచెఱంగు లేలె మార్తురగుండె
గాలమై యొక తెల్గుకలువకంటి
సకలతంత్రావాపచాతుర్యరాశియై
రాణించె నొక తెల్గురాచవెలఁది
శీలసంపద చెక్కుచెదరకుండుటకునై
బలివోయె నొక తెల్గుపద్మవదన
కవ్వించురిపులఢాకకు జంకుమగనికై
పసపిచ్చె నొక తెల్గుపసిఁడిగుమ్మ
కాసె బిగియించి రెండవకాళివోలె
సంగరము సల్పె నొక్క తెలుంగు లేమ
తెలియవలెఁగాని తెల్గుకాంతల చరిత్ర
కోహినూర్లకు నూర్ల కేకొదువలేదు

ఒకచాన వాసంతమకరందవాహినుల్
పరువు లెత్తించెఁ గబ్బంబునందు
ఒకచాన సర్వశాస్త్రకళాపయోనిధుల్
కడచె నానాతర్క గతులతోడ
ఒకచాన నందగోపకతపమ్ములపంట
నింటిబంటువిధాన నేలుకొనియె

ఒకచాన రాజభక్తికిఁ దారకాణమై
　　　　నిజభూపవంశంబు నిలువఁబెట్టి

చాన యొక్కర్తు విసరిన శాపవాక్కు
బీరముంజూపెఁ జిచ్చఱపిడుగువోలె
తెలియవలెఁగాని తెల్గుకాంతలచరిత్ర
కోహినూర్లకు నూర్లకే కొదువలేదు

౧౫-౧౨-౩౮

---

౧ రుద్రమాదేవి ౨ నాగమ్మ 3 మల్లమ్మ ౪ రణతిక్కన భార్య చానమ్మ ౫ పెమ్మసాని తిమ్మానాయని చెల్లెలు గోవిందమ్మ ౬ మొల్ల ౭ నాచి ౮ వెంకమాంబ ౯ కొంపెల్ల మహాలక్ష్మమ్మ ౧౦ రాయజగపతి భార్య సీతమ్మ

# హంపిక్షేత్రము

ఇచ్చోటనే పూసి రేలజవ్వనులు తెల్గ
వెలఁదుకల్ మగలకు వీరగంధ
మిచ్చోటనే త్రోసి రిద్ధశౌర్యులు తెల్గు
లగిసేనఁ గన్నెకయ్యంబునందె
ఇచ్చోటనే మోసి రెల్లదిక్కులరాజు
లంధ్రసమ్రాట్టు ముత్యాలగొడుగు
ఇచ్చోటనే వ్రాసి రెలనాఁగమోవితోఁ
దులవచ్చు కబ్బముల్ తెలుఁగుకవులు

ఇచటనే కోసి రమరతాప్రచురశిల్ప
చతురు లాంధ్రులు కీర్తిసస్యములపంట
నేఁటి కిటు దుర్గమారణ్యవాటి యగుచు
రూపుసెడిపోయెఁ గాని హంపీపురంబు

కర్ణాటక్షితిపాలపండిత జయాఖండప్రభాకల్పిత
స్వర్ణస్నానము నంది తద్రసికరాజశ్రేష్ఠు నిచ్చోటనే
వర్ణించెన్ గవిరాజు ధూర్జటిశిరోవాటీనటత్ స్వర్ణదీ
తూర్ణాంభః పరిభావి భవ్యకవితా దుర్వారధారోద్ధతిన్

౫-౭-౪౦

# పలునాఁడు

నాగార్జునాచార్యనవ్యతేజశ్ఛటల్
చిందు త్రొక్కిన దివ్యచిత్రశాల
వీరవైష్ణవమతావిష్టులై తెన్గులు
తిరుమణి తీర్చిదిద్దిన పొలంబు
వెలనాఁటిబోటిఁగోరి వియ్యంబులు బిగించి
కేరింతలాడిన వీరభూమి
చంద్రభాగాసరిజ్జలశీకరంబులఁ
జెమ్మగిల్లిన జగాచేవనేల

ప్రకృతిసౌందర్యలక్ష్మికిఁ బట్టుఁగొమ్మ
చిన్ని నా తెల్గుతల్లికి జీవగఱ్ఱ
పోటుమానిసులం గన్న పోతుగడ్డ
నాదు పలునాఁడు మేలిగొనాల గూఁడు

శ్రీనాథ కవిరాజ వాణీ విపంచికా
సృత సుధాధార లెచ్చోట నొలికె
మధురాపురీబుధప్రథఁ దూల్చు సోమన్న *
సాహితీసుమము లెచ్చటను వలచె
సోమరసంబులోఁ జొనిపి పింగళి మంత్రి
సుకవితారసము నెచ్చోటఁ బంచె

---

* ఇతఁ డప్పకవి తాతకుఁ దాత

కాకుసూర్యప్పన్న గంటంపు గజ్జెఘల్
గడుసుపోకడల నెక్కుడను మొరసె

తెలుఁగుబిడ్డల చిఱువేఁడి ♦ పలుకు నెత్రు
టేర్లు తుకతుక నుడికి పొంగత్తి పొరల
వీరగీతంబు లెచ్చోట వినుమిగిలె
నదియె పలునాఁడు దీనికున్నదియె జోడు

చండశాత్రవశిరఃఖండకాండమ్ముల
బాలచంద్రుం డెందు బంతులాడె
గంటంబు నెఱవాలుఁగరవాలు చేఁ బూని
రెడ్డినాగమ్మ యేగడ్డ మెఱసె
హంవీరసింహంబు లయ్యారె! యని మెచ్చ
ననపోతు రుధిర మే యవనిఁ గార్చె
శూరనారీపరిస్తూయమానచరిత్ర
మాంచాలయెచ్చోట మగనిఁ దేలిపె

నటదుమానాథ మస్తకతట విరాజ
దభ్రగంగా ప్రవాహంబుఁట్లు తెలుఁగు
దొరల కీరుతు లేనేలఁ ద్రుళ్ళిపడియె
నదియె పలునాఁడు చూడరావయ్య! తోడు

౧౦—౩—౩౮

♦ [illegible]

# మాయూరు

ప్రచలితస్వాతంత్ర్యరణవీరకాహళీ
రుతిరాణన్ముహుర్ముహు ర్ముఖరితంబు
జాతీయవిద్యాప్రచారసంతోషిత
బ్రాహ్మీచిరంతన ధర్మపీఠి
సాబర్మతీయోగిసమగ్రమ్మహాశీః ప
రంప రాదానపాత్రప్రవృత్తి
సేవాతపఃక్రియాజీవాతుమండలీ
విశ్రుత వినయాశ్రి మాశ్రయంబు

మధురతరశీల సంవర్ధమాన తరుణ
వృద్ధనారీనరచ్ఛటావేష్టితంబు
మఱపునకురాదు "కావ్యూరు" మామకీన
గాఢతరపుణ్యరుక్సూచి కాణయాచి

౨౦-౫-౮౭

# విద్యార్థి

ఆద్యాఖండయశోధనం బెడసి దాస్యస్ఫూర్తిఁ జింతాభరా
పాద్యంబై భరతోర్వి నేఁడు విలపింపన్ సాగెఁ దద్రోదన
ప్రోద్యద్ధ్వానము వీనులం జొరదా? యేబుద్ధుల్ నినుంజుట్టెనో
విద్యార్థీ! నినుఁ గన్నతల్లి మొఱ నీవే యిట్లుపేక్షింతువా

చెలఁగి మార్తురఁ జించి చెండాడినైచిన
యభిమన్యుఁ డేతల్లి యంక మెక్కె
చిచ్చఱపిడుగు పుంజీభూతశౌర్యంబు
బాలుఁ డేయమజోలపాట మెచ్చె
సెఱజోదు పగఱగుండెలలోన గాలమై
మనినశివాజి యేజననిఁ గొల్చె
జగదేకవీరప్రశస్తతేజోరాశి
జవహరుఁ డేమాతచన్ను గుడిచె

నమ్రమహోసాధ్వి సకలలోకైకజనని
భారతాంబకుఁ బండినపంట వీవు
అన్నలకు మచ్చుఁ దేఁబోకు మెన్నఁడేని
నుతగుణాధార! వీరభారతకుమార!

నవయుగమేగుదెంచెఁ బరిణామము నొందె జగంబు నూతన
చ్ఛవులు నటించుచున్నవి దిశాగణమందు స్వతంత్రతావధూ
నవనవదివ్యయౌవన మనంతముఖంబుల నిండి భారతీ
యువజనచిత్తవిత్తముల నూఁపుచుఁజూపుచునుండెఁ దళ్కులన్

లెమ్మికఁ మీనమేషముల లెక్కలు మానుము భావదాస్యబం
ధమ్మును ద్రెంపివేయుము వితండవివాదము లుజ్జగింపు ద
ద్ధమ్ముల భేదవాదసముదాయముతోడఁ బనేమి నీకు నీ
యమ్మ ఋణమ్ముఁ దీర్చి చరితార్థత నందుము మిత్రసత్తమా

అమరులు గుంపుగూడి విజయోస్తని నందనచందనస్ఫుర
త్సుమసముదాయముఁ గురియఁజొచ్చిరి నీపయి; దిక్తటంబులం
దుములములై ధ్వనించె జయదుందుభిఘోషలు మంచిలగ్నమీ
సమయము; లెమ్ము లెమ్ము పటుసాహసదోహల దుర్భరార్భటిన్

లోకు లిసీ యనన్ జగతిలోఁ గలకాలమునూఁగులాడుచున్
గాకము కైవడిం బ్రతుకుకంటె బుధుల్ తలలూఁప గంటయేఁ
గోకిలమై వెలుంగు టది కూడదొ విజ్ఞుఁడు కీర్తికాయముం
గైకొన రక్తమాంసమయకాయము హేయము నీసడింపఁడో

# పాదధూళి

ఆది దురాశాపిశాచీ సమర్చ్యన ప్రి
భూత సవన బృహద్భాను హేతి వదన
హుతదయాధర్ములకు, నరాకృతి నివిష్ట
దుష్ట రక్షస్సులకు, జగద్ధూమకేతు
వులకుఁ గేతువులకు వణిక్కులకు నిలయ
మది నిరంకుశోద్దామ దురంత దుర్భ
రాగ్రహావేశ వికటాట్టహాస జవన
గమనవిన్యాసముల కసంఖ్యాత సాధు
మానవీ మానవచ్ఛటా ప్రాణమాన
రాశి బలిపోయినట్టి నిర్భాగ్య దేశ—
మది మహాభూతవేతాళమదవతీ ప
రంపరా రూక్షఖడ్గనిర్యత్ ప్రభా స
ముజ్జ్వలద్దంష్ట్రయై మృత్యు వుగ్రదీర్ఘ
జిహ్వాలార్చుచు వాహ్యాళి చేసినట్టి
రంగ— మది మదిఁ గరఁగించు వంగభూమి

* * *

సత్యకంకటధరుఁ డహింసాకృపాణి
శాంతిరణవీరమండలీ చక్రవర్తి
మోహనుఁడు విశ్వకల్యాణమూలమూర్తి

జాలికి న్నెలవైన యీ నేలఁ జూడఁ
గదలె భగవానుఁ డాత్రరత్నౌతపస్వి

* * *

గుండెలో నగ్నిగోళముల్ మండి ప్రేల
నూర్పులో మూఁడులోకమ్ము లూఁగియాడఁ
జూపులో నెయ్యతియ్యాల సోన లురలఁ
బలుకులో నవజీవసంపదలు పండఁ
బల్లియలు పట్టణంబు లాప్రభువు చూచె

* * *

తట్టెసె ఋషిరాజు "రాంపుర" ద్వారవేది
బలసె నా బాలవృద్ధ ప్రపంచ మతని
నెరసె నాశాద్యుతుల్ ప్రజానేత్రవీధి
మొరసె జయజయధ్వని దిశామూల మదరఁ
గురిసె యోగీంద్రు శిరముపైఁ గుసుమవృష్టి

* * *

పారు లేతన్మహాోజాత పారవశ్య
మగ్నలై యున్న వేళ డింభకుఁ డొకండు
పరుగుమైవచ్చి తత్సభా ప్రాంగణమ్ము
డాసి జర్జరితమ్ము కూర్పాసమూడ్చి
మూటకట్టఁదొడంగె నచ్చోటి దుమ్ము

* * *

ఏమిరా వెఱ్ఱి పాపఁడా యీ ప్రజా స
ముద్ర మిటు పొంగి మిన్నులు ముట్టుచుండ

దృష్టి సారింపవైతి వాదిశకు నీవు
సాగి దర్శింప వాకర్మయోగిచంద్రు
నేల ముడిచెద నీపాంసుజాల మిచట

* * *

అయ్యగారూ నమోవాక మమ్మహాత్ముఁ
గంటి నేనఃపిశాచికం గదలుమంటి
హరిజనత్రాత నా స్వామి యడుగుసోఁకి
పరమ పావిత్ర్య లక్ష్మీవిభాసియైన
యీ రజోరాశి జననికై యెత్తుచుంటి

* * *

అమ్మ ! నన్నిసదస్సున కనుచు వేళ
దివ్యపూరుష చరణ బాంధవ్యమంది
పతితపావన పాద సంపర్కమంది
సుకృత సురభిళమైన పాంసువును దెచ్చి
దుఃఖనిస్తారకంబైన ధూళి దెచ్చి
యస్మదీయము పరితాప మార్పుమనియొ

* * *

మున్నొకమహాత్ము నడుగుదుమ్మునకు సోఁచి
కఠినశిల పూవుఁబోఁడియై కదలెనంట
ఘోర జానుషబంధముల్ గోసెనంట
బాబయా ! యిమ్మహాత్ముని పదమునంటు
దుమ్ముచే గంట లేమొ మాదుర్విపత్తి

* * *

దీనబాంధవురూపమ్ము దెల్పుమంచు
వేషభాషావిశిష్టతల్ వినుపుమంచుఁ
జేష్టితమ్ములఁ వర్ణించి చెప్పుమంచుఁ
దల్లి ననుఁబంప జన్మసార్థక్యమొదవె
సాక్షిగావచ్చెఁ గనుము బాష్పస్రవంతి

* * *

నా సవిత్రి నా సోదరి నగ్నలగుచు
గుడిసెనున్నారు జేనెఁడు గుడ్డలేక
కుములుచున్నారు బ్రతుకు వ్రేఁగునకునోడి
యుడలుచున్నారు పరిత్యక్తమైన వేల్పు
దెసకుఁ గనుఁవిప్పలేని దుస్స్థితికి లోఁగి

* * *

జనకుఁడెందుండెనందువా జఠరకోశ
మెరియుచున్నది నీకు నుత్తరమొసంగ
నంబలియులేక రోగాల నడ్డలేక
యాలుబిడ్డల కన్నీటి నార్పలేక
స్రుక్కి మము దిక్కులేని పక్షులను జేసి
యతఁడు దుర్భిక్షవహ్ని కాహుతిగ మాఱె
పోయె నసిపత్రశిక్షావిధేయ హేయ
విత్తదాసులకొక నవ్వు విసరి, కొసరి
పిలుచు నమరేంద్రు గద్దెపైఁ గొలువుదీర

* * *

పతియలై వీరలై నాగుండె బాలకా! త్వ
దీయ కథ లీదృశంబులా! దీనతా ని
మగ్నులకు మీకు, మిమువంటి మానవాళి
కిట్టి దుర్యోగ మింక లిప్తయేని నిల్వ
దిట్టి దుష్కాలమింక నెన్నఁడేని దాయ
దిది పరాధీనతాఫలం బిది నికృష్ట
దాస్యఫల మస్వతంత్రతా దారుణాంధ
తమసమును జీల్చ మాతృత్రాణదమనజన్య
ధన్యతగడింప నేఁడు సోదర్యులెల్ల
నడుముఁగట్టిరి ప్రాణము లుగ్రుడుపుగట్టి
రడఁచి రాత్మీయ కులమతాహంకరణము
విడిచి రీర్ష్యామషీజుష్ట వీక్షణమ్ము
నలఁది రుష్ణాంగి వీరగంధావలేప
మగ్గలించి రహింసారణాంగణమున
నెత్తిరి త్రివర్ణశోభి తామృతపతాక
నెత్తి రొక్కుమ్మడిగ దేవదత్త కుమార
మంతిపుర మజ్జగించి శౌర్యాచ్ఛరేఖ
లింతు లెసరేఁగి వీరతామెతులుగట్టి
కుసుమపూవన్నె నల్వము లుక్కు స్తరించి
మాతృసేవాపరాయ ణామ్లానదీక్ష
శిక్షితాత్మలు ధీరలక్ష్మీ సనాథ
లపరదుర్గలు రుద్రాంబ లగుచు నగుచుఁ
గలని కహామహమికతోడఁ గదలివచ్చి

రెవ్వారీ యోద్ధృమండలి నెదిరినిల్చు
ద్రఢిమ గల మగ, లెవ్వారీ తరుణాభార
త స్రవంతి నిరాఘాట ధాటికోర్చు
దమ్ముగలబంటు లదిగో స్వతంత్ర తారకా
మండలారుణరోచిస్సమాజ ముదయ
పర్వతప్రస్థభూమిఁ గ్రొం బసిడిజల్లు
చల్లుచుఁ విజయోత్సవ సముసిద్ధి
సూచియయ్యెఁ బ్రసన్నతల్ పూచి దెసల
వెల్లివొడిచె హుటాహుటి నిల్లు సేరి
తల్లి కేమేలుపల్క చూతప్రవాళ
తోరణము కట్టవోయి! మందార కుసుమ
హారమిది దాల్పవోయి! దీర్ఘాయురర్థ
భారములు మోయవోయి! నవ్య స్వాతంత్ర్య
భారతము నేలవోయి బంగారుతండ్రి!

౨౮—౧౨—౪౫

# స్వతంత్ర భారతము

జయచంద్రుఁ డపగతఘ్రాతుఁ డానాఁడు
రగులుకొల్పిన చిచ్చురవ లేచి యేచి
యఖిలభారతభూమి నల్లార్చియార్చి
యిన్నాళ్లకిన్నాళ్ళ కిట్టెంకులించె—
ఈ దవానలమార్ప నీదాస్యమడఁప
నెత్తురోడ్చిన శూరనివహమ్ము పేర
నురికంబమెక్కిన యోధులపేరఁ
బూనవోయీ! మల్లెపూలదోసిళ్లు
పాడవోయీ! వీరభక్తిగీతములు—
కులవర్గములు పెంచు క్రుళ్ళింత లేని
మతపిశాచంబుల మనఁగడ లేని
ధనవద్దరిద్రభేదచ్ఛాయ లేని
పరులకూటికిమ్రూఁగు బదనికల్ లేని
విద్యావిహీను లేవీధిలో లేని
దైన్యరేఖలకు నాధారంబు లేని
జీవత్సమాజంబు సృష్టిగావించి
తమ్ముఁడా! నీ తేరు తరలింపవోయి!
మనప్రాక్తన మహస్సు మరలింపవోయి!

౧౫-౮-౪౭

# దొరతనము

తొలుసంజఁ బుట్టునాజ్ఞలకు బైసి దొఱంగి
మలుసంజ నపరకర్మంబు సలిపి
కులపాశములఁ దగుల్కొని శుంఠలను బిల్చి
యుత్తాలపదవిఁ గూర్చుండఁ బనిచి
లంచాలగడ్డి గాసించి లోకులఁ గ్రుమ్మ
నధికారిపశువుల కచ్చుపోసి
చీకటిబేరముల్ సృష్టించి పేద నె
త్తురు పీల్చురక్కసి నురక విడిచి

పరువు దక్కించుకొన్నట్టి దొరతనంబు
లేదు భువనత్రయమ్ములో లేదు లేదు
చెప్పనేటికి విద్యావిశిష్టుఁ డైన
మంత్రిముంగడ ధర్మమర్మంబు లెత్తి

౨౦-౧-౪౭

# నేతాజీ

ఇదె మహోదయవేళ యయ్యెను
వదలుమీ యజ్ఞాతవాసము
కదనకేళీ రుద్రమూర్తీ
కదలిరావోయీ !

బ్రతుకు బరువై క్రుంగిపోయిన
గతులు కఱవై దెసలుసూచిన
వెతలమున్గిన తల్లి కొఱకై
విక్రమించితివా !

మహిషరక్తో రుధిరమేదో
మగ్నకాళీ మాతృరూపము
దహరనీమ ఘటించి ఖడ్గము
దాల్చి నడిచితివా

జిత్తులన్నిట నందెవైచిన
చేతులే నీయెత్తుఁగోఁ బడి
చిత్తుచిత్తై తెల్లవోయిరి
చిన్నవోయిరిగా

బానిసమ్మునఁ గ్రుళ్లి కుమిలిన
బ్రదుకుకంటెను చావు మేలని
షానవాజ్ ధిల్లాను సేగాల్
సేన కూర్చితివా

పొగల పిల్లున సెగల పెంపున
యుగ యుగమ్ములు పెరిఁగి పేరిన
పగలు మానివి హిందు ముస్లిం
బాట దిద్దితివా

విశ్వభారత వీరకోటికి
శాశ్వత ప్రేమమ్ము కూరిచి
యాశ్వోధ్వజినీ పరంపర
కాజ్ఞ లిచ్చితివా

రక్త తిలకము దిద్ది భారత
రమణి పౌరుషలక్ష్మియై మన
ముక్తికై నీ కన్నుసన్నల
మోహరించెనఁటే

కంటగించిన పోటుములు నీ
కంటి యెఱ్ఱన కాఁగఁజాలక
మంటిబొఱ్ఱెలలోన నక్కల
మాడ్కిఁ దూఱిరఁటే

ప్రాఁతగాథల నిద్రవోయిన
భారతీయుల సమరచండిమ
లోఁతు లోఁతులు చూపి జగముల
లోభపెట్టితినా

ఎదురుదారతన మేగ్ప్రరించితి
వెదిరిగుంఁజీయు గాల్లమైతివి
కదరుజెండా యెత్తి యిన్నాళ్
కదన మూఁపితినా!

చాలుఁ జాలు మహాప్రభూ! మన
సాహసం బొకసారి చాటితి
హేలగా నీఁక సైతు బన్నము
లెన్ని పైకొనినన్

కట్టుబట్టల నిల్లు వెడలిన
వట్టిమానిసి నీవు రాజ్యము
లెట్టు గెల్చితి, పిన్న మాయుల
నెపుడు నేర్చితివో

వెక్కిరించిన రథికమండలి
బిక్కమొగమై డిల్లపోవఁగ
నెక్కితివిరా సర్వమానవ
హృదయ పీఠములన్

జాతి యొకటే లక్ష్య మొకటే
నేత యొకఁడే దేశమున కని
నీతి నేరిపి మాకు నాశా
జ్యోతి వైతివిగా

తారకంబై మమ్ము లేపెను
తావకము జైహిందు నాదము
ఘోరవిక్రమ మూని ఢిల్లీ
కోటగెల్తు మిఁకన్

వీరతా మొతు గట్టినారము
వీరపానము చేసినారము
లేరు లేరిఁక నడ్డుకోఁగల
వారు మాకెచటన్

భవ్యభారత మధుర మూర్తీ
దివ్యభారత సవ్యసాచీ
నవ్యభారత చక్రవర్తీ
నతులు నీ కివిగో

ఆసమై గంగా జలమ్ములు
మోసి తెచ్చిరి, దేశభక్తులు
డాసిరా, యభిషేక లగ్నము
డాఁగవల దింకన్

సాగిరమ్ము స్వతంత్ర హిందూ
సైన్య చక్రక్రమణ నేతా
ఏగుదెంచిరి కమ్మహారతు
లెత్తగా మహిళల్

కోసి తెచ్చిన పూలగుత్తులు
గుచ్చి దండలు కట్టినారము
బోసు వీరా ! పూజలందుము
పురుష సూక్తమునన్

పంటమొగ మైనట్టి పొలములు
కొంటె గాలికి దెబ్బ తినెనని
యొంటిపాటున వెచ్చనూర్పుచు
నుంటివా తండ్రీ !

మేటి మగటిమి చూపుటొకటే
మెచ్చుకోదగినట్టి పనిరా
ఓటు గెల్పులు సాజముల్ గద
పోటు మానిసికిన్

పాడినది నీకీర్తి మురువై
పాలసంద్రము మీఁది నురుపై
నిండినదిరా విశ్వజగతీ
ఖండ ఖండములన్

౧౬-౧౦-౪౬

# నవ భారతి

కడచిపోయిన వెన్నోయుగాదు లోక-
రీతిగా - వానికేమిటే - జాతికెల్ల
నభినవానంద పారవశ్యమ్ము నిడుచుఁ
బండినయుగాది యిది తపఃఫలము మాది

ఒకయేఁడో పదియేఁడులో యిరువదేండ్లో నీచదాస్యంబు త
ల్లికి వేయేండ్లుగ వచ్చి యిప్పటికి వ్రీలెన్ దూరె సర్వంబు జో
హుకుముల్ సెప్పుచు సిగ్గిమ్రిగ్గ చెడు దుర్యోగంబులెల్లన్ వికా
వికలై చన్నది నవ్యభారతశకావిర్భూతయై నేఁటికిన్

తన బోసినవ్వుముత్యాలపంటలు ప్రజా
హృదయమందారిద్ర్యంబు కదలఁద్రోయ
తనచూపుజిగి రసాతలతమఃకూపస
జంతుకోటికిఁ దెల్వి సంతరింప
తనపల్కు లుపనిష త్సారనిష్యందమ్ములై
సమతామనోజ్ఞసస్యములు పెంప
తనబాట్ల కేవ సత్యము నహింసయుఁ దరు
చ్ఛాయలై పాంథుల శ్రమ మడంప

తనపతాక పరమధర్మచక్రాంకిత
మై సమస్తజగతి కభయ మొసఁగ
తనదు బ్రదుకు బ్రదుకు జనిదాస్యవిముక్తి
కప్పగించుగాంధి కంజలింతు

తానై శాంతిరణంబునం గనిన స్వాతంత్ర్యంబు పూతంబు లో
కానీకమ్ము చరిత్రకే యొకవినూత్నాధ్యాయమున్ బెంచె స్వా
ర్థానన్ క్రుళ్ళినమానవాళికై మిథోంతస్స్నేహదీక్షా ౧౧
క్షా నైర్మల్య మొసంగుచున్ వెలిఁగెఁ దా నాళాజ్యోతిస్సై దిక్కులన్

ఎక్కడికక్కడ ముక్కలు
ముక్కలుగాఁ దెగిన దేశములు జాతులు నై
స్రుక్కిన జగంబు నీఋషి
ఋక్కులుగా కేవి యుద్ధరింపఁగ నేర్చెన్

చెదరిపోలేదు దేశికపాదముద్రలు
నౌకలీ శాంతియాత్రాకృతములు
ఇంకిపోలేదు నల్వంక సాగిన స్వామి
రామనామ సుధాధునీమతల్లి
చెఱిగిపోలేదు హస్తినా రాజధానిఁ
దండ్రి చిందిన బలిదానరుధిర
మాఱిపోలేదు యమునా రాజఘట్టాన
రేఁగిన ప్రభుచితార్చిశ్చయంబు

నిత్యనూతనచైతన్య సత్య మసృణ
మూర్తియై జగదంతరవర్తియైన
మనమహాత్మున కీ చైత్రమధురవేళఁ
జిత్త మిగురొత్త నివాళి నెత్తవోయి!

మతమౌఢ్యజనిత రామ రహీము భేదనా
దావేశనష్ట కష్టాత్ములార!
స్పృశ్య తాస్పృశ్యతా హేయచింతా కర్త
రీ ఛిన్నవిచ్ఛిన్నహృదయులార!
దారుణ దారిద్ర్యదహనతప్త ప్రజా
రక్తపానకిరాతగణ ప్రపీడితులార!
చార్వాక పాషండ దుర్వ్యామగ్నవివిధా
లబ్ధాపనీతి విషాబ్ధులార!

రండు రండోయి త్రిభువనారాధనీయ
బాపుజీ ప్రేమధర్మతత్త్వోపదేశ
జాహ్నవీస్నాతులై సాధుచరితులై త
రింపుఁడీ నూత్నవత్సర శ్రీముఖమున

కత్తికిఁ గత్తిఁ జూపి రిపుకంఠవిలుంఠన మాచరించు దు
ర్వృత్తి నశించి శాంతిప్రియు లెత్తిన కత్తికిఁ గంఠమిచ్చుచున్
దత్తరపాటులేక రిపులన్ దెగటార్చుట వీరజాతి క
ర్తవ్యమధర్మమై నవయుగోదయమై జగముల్ సుఖించుతన్

మోడు మోడును జిప్పురించి మొగ్గతొడుగఁ
గవిపికమ్ము లరవళి సల్లపఁ జెలంగ
నవ్యభారత సింహాసనస్థుఁడైన
వాని కగు స్వస్తి నవశరద్వల్లభునకు

౧౬-3-౫౦

(ఆలిండియా రేడియో— విజయవాడవారి సౌజన్యముతో)

# కాంగ్రెసు

తరతరాలతమస్సు తరలించి మరలించి
　　　　యేశక్తి మనయింటి కిచ్చె వెలుఁగు
కులమతాది కఠోరకుడ్యముల్ పడఁగొట్టి
　　　　యేతల్లి సౌహృద్య మిడియె మనకు
జగదజేయము నహింసామహాస్త్రముఁ జూపి
　　　　యేదేవి మనచేవ సిగురుకొల్పె
విశ్వప్రజారాజ్యవీధిలో మనజాతి
　　　　కేరాణి వేయించె పే మపీఠి

కర్మచంద్రితనూభ వాఖండ సత్య
శౌచ రోచిస్సు లేసవ స్సాఁచికొనియె
దాని కంజలిఁబట్టి సార్థకత నందు
యిండియన్ నేషనల్ కాంగ్రెసిది కుమారా!

పదవులకేమి తెగంబడి
వదలకుమా తల్లికొల్వు వక్రమనీమన్
పదిమంది నీదుసేవకు
ముదమందిననాఁడు పట్టములె నిన్ వలచున్

కదనం బొనర్పు రాహుతు
పదపద మని యాజ్ఞలిచ్చు పడవాల్ కంటెన్
గాదవపడునొక్కొ మటి నా
యది యెపుడున్ బంటు దెసకె మన్నన చూపున్

౩౧-౫-౫౧

# కర్షకుండు

మండునెండలలోన మలమల మాడి దు
ర్భరశీతబాధఁ గొంకరలు వోయి
వానలో వఱదలో నాని జీవము లాఁపి
కఱకుముండులలోనఁ గాళ్ళు మోపి
తేళ్ళ పాములలోన దెసమాలి తిరుగాడి
మోవఁజాలని వ్రేఁగు మోసి డస్సి
ఒడలెఱుంగని నిద్ర యొకనాఁ డెఱుంగక
కుక్షినిండని పేదకూడు కుడిచి

ఆఱుఁగాలంబు గండంబు లన్నిగడచి
సేద్య మొనరించి తుదకుఁ దా సేకరించు
పంట సకలంబు నరికె నప్పన మొనర్చి
కంటనీర్వెట్టె నక్కటా! కాఁపుబిడ్డ

కూలిపోయిన కొంప కుదుటఁ బెట్టఁగ లేక
యుస్సురు మనుచుండె నొక్క కాఁపు
ఎలనాఁగ కూఁతు పెండిలి సేయలేక క్షే
త్రము వంచుకొనియెఁ గర్షకుఁ డొకండు
పసిబిడ్డకై బుడ్డిపాలు తేలేక చీ
కాకులోఁబడె నొక్క కమ్మ్రతీఁడు
కొడుకుఁగుఱ్ఱను మంచిబడికిఁ బంపఁగ లేక
గొల్లు గిల్లెడి నొక్క గొప్పరైతు

హెచ్చు కట్నాలు వైద్యాల కీయలేక
చిక్కి సగమయ్యె నొండొక్క సిస్త్రగాఁడు
పరువుబరువున బ్రదికిన పంటదొరకుఁ
గటకటా! నేఁటి కెట్టి యిక్కట్లు వచ్చె

మీసరంబునఁ గోరమీసాలు వడివేసి
భూపతుల్ నెలఁజూచెదూర్పుఁ జూడ
కలికి బంగారు మేడల రాణివాసంబు
లెందఱన్నఁ గనియె సుఖింప
దారలేని గరువంబు తొలఁకాడ సద్యోగు
లుట్టూఁత లూఁగుచు విఱ్ఱవీఁగ
కోట్లకోట్లుగడించి కోశంబులకు సంచి
బేహారి తనబొజ్జ పెంచి కులుక

అన్నమో రామచంద్రా! యటంచు నేడ్చు
కటికబీదలు దోసెఁడు గంజి దాగి
నీచకద కారణం బహో! నీకు నెట్టి
కట్టుకడగండ్లు వచ్చెరా! కాఁపుబిడ్డ!

బిందెలతోడఁ బాల్పిండెదు గాని నీ
కంచంబులోనికి గంజినీళ్ళె
కొండంత సుసంపత్తి పండింతుగాని నీ
కాయంబు మూయంగఁ గప్పడంబె

తలుపుట్లవద్ద గాదెల నింతుగాని నీ
క్షుద్బాధ నడఁగింపఁ జోళ్లజావె
కమ్మనిశాకముల్ కాయింతుగాని నీ
కూరకై కటికిసంబారుపాడుమె

ఏమని వచింతు నీబాము లెల్లఁ దడవి
కడుపుచుమ్మలువాఱు నీకథలు విన్న
విన్న మఱచిరె దొఁగలయో! నేఁటి కెట్టి
చెట్టు నినా ముట్టడించెరా! సేద్యగాఁడ!

పెద్దవడ్డీలొడ్డి పీల్చె నీ రక్తంబు
చట్టుఱాగుండియౌ సాహుకారు
బన్నం బెఱిఁగి నీపంట నల్పక్రయం
బిచ్చి బండ్లకు నెత్తె బచ్చు కటికి
లంచంబు నాసించి కించిత్తు నీతి లే
కధికారి నీ కూటి కడ్డు దగిలె
దారుణం బగుపన్ను దయమాలి విధియించి
కటకటా! నృపతి నీకడుపు మాడ్చె

ఇన్నిరీతుల నీసొమ్ము తిన్నవారె
చూచుచున్నారు నిను గడ్డిపోఁచవోలె
లేదొకో ధర్మ మర్త్యుపై లేశమేని
సారగుణరత్నహార! కర్షకకుమార!

సుక్షేత్రములు దయాశూన్యులై పీడించు
ఋణదాతలకు సమర్పింప వలసె
ఇల్లాలిమెడలోని నల్లపూసయు వెచ్చ
పెట్టి పన్నులపొట్టఁ బెట్టవలసె
దినవెచ్చమునకునై తెచ్చు బాకీలకై
కొంప తాకట్టులో దింపవలసె
కడుపుకక్కుఱితికై గతిలేక పశుకోటి
నెల్ల మెల్లన విక్రయింపవలసె
ధరలు పడిపోయె సేద్యంబు తక్కువాయె
శిస్తు మెండాయె నింకేమి సేయుదోయి !
నిర్జనారణ్యమే నీకు నెలవటోయి !
కర్షకా ! యిది యేనాఁటి కర్మమోయి !

సంఘశక్తి నెఱింగి జనపదంబుల నెల్ల
రైతుకూటంబు లేర్పఱుపవయ్య
నీ గౌరవము నెంచి నీ చేనఁ బాటించి
తలయెత్తి దీనతన్ దలఁగవయ్య
వెఱపు దవ్వుగ జోపి దొరలసజ్జనుఁ జేరి
నీగోడు నెల్ల విన్పింపవయ్య
నీ మేలు గోరి నీ నేత లిచ్చు దురాయి (ఆజ్ఞ)
పూదండవలెఁ దలం బూనవయ్య

సాటిదేశాల కాఁపులజాడ లరసి
నేఁడు నీకర్జ మెద్దియో చూడవయ్య
ఉమ్మలిక లెల్లకాలంబు నుండఁ బోవు
చింతపడకయ్య ! భారతక్షేత్రజీవి !

౧౬—౩—౩౮

# క్షేత్రజీవి

అమ్మతల్లులవంటియావు లింటింటిలోఁ
గదుపులై యమృతంబు పిదుకఁ జేసి
కండబింకము నూపి కొండలై నను మోసి
కలుము లందిచ్చు గిత్తలను బెంచి
పనిముద్దు గాని సంపద ముద్దుగా దన్న
జీవసూత్రము శిరసావహించి
గొడగరి వడ్రంగి గోసంగి కనుదోయి
దైన్యరేఖలకు దాద వ్వానర్చి

కదురు గలచోటు కవ్వంబు కదలుచోటు
కలిమిపులకు ధూమకేతువుగా నెఱింగి
త్యాగమున కాశ్రయము కర్మయోగి వగుచుఁ
గీర్తి గనవయ్య భారతక్షేత్రజీవి !

పరధర్మముల మెచ్చి పరువులెత్తెద వేల
కోటివిద్యలు కొండక్రిసాటి యగునె
పట్టణంబులఁ జూచి లొట్టవెట్టెద వేల
తల్లికౌఁగిలి గదా పల్లెటూరు
కొంప నిల్వనఁగూల్చి కోర్టులఁ బట యేల
దద్దుతీర్పదే లేఁడె పెద్దకాఁపు
బక్కరైతునుఁ దొక్కిపెట్టఁజూచెద వేల
మేలోర్వ కేవ్వాఁడు మేలుకొనియె

కలవరించెద వేల కల్కంబుకొఱకు
విషకణం బది నీదుజీవితప్రసుధకు
సడలిపోయినశీలంబు సంతరించి
కీర్తి గనవయ్య భారతక్షేత్రజీవి!

౮—౩—౪౦

# శివకరక్షుఁడు

చదలేటి నీటిసంపద రిత్తవోనీక
సిగముడి నానకట్టగ నమర్చి
యల జాహ్నవీముఖ్యములు చిన్నపెదకాల్వ
లఖిలభారతభూమి నల్లుకొల్పి
ముక్కారుపంటల ముద్దులెక్కంబనఁ
గేల ముమ్మొనల ముల్గోల దూఁడి

మొదమువ్వపాటలో నొడలఁ బుల్కలు రేఁగ
బసవన్న నసివాఱుపనికిఁ బనిచి

యిల్లు వెండియు బంగారు విల్లుగాఁగఁ
బండి కైవ్రాలినజగమ్ము పంటపొలము
కాపలికి ఘోరసర్పకంకణము గట్టు
శివుని మాపెద్దకాఁపు నర్చింప రండు
౩౧–౧–౪౫

## పాలేరు

అధికారి యెవఁడు నీ యస్థిదండములోని
పచ్చిమూలుగ జుఱ్ఱు పాలసుండు
ధనవంతుఁ డెవఁడు నీదైన్యముద్రాజను
ర్మ్యాలకారణమైన కాళరాత్రి
మతి మన్న నేమి సోమరిమూఁకలకు నిన్ను
బలి యిచ్చునట్టి పాపగ్రహంబు
రాజన్న నెవఁడు నీరక్త మాంసములతోఁ
దనువు పెంచెడు మహాదానవుండు
శేరి యెవ్వఁడు తడిగుడ్డ నూఱి నీదు
కుత్తుకను గోయు వలకారి జిత్తులాఁడు
చూడు మొకసారి కర్షకా ! చుట్టు మనఁగ
నెవ్వఁడున్నాఁడు నీకుఁ బాలేరు దక్క
౧౩–౩–౪౦

# గోసేవ

ఔపనిషదసూక్తు లవి గవాకృతు, లావు
లమృతరాసు, లుత్తమాధ్వరంబు
ధేనుపూజనమ్ము., గాన వినీతిమై
మోఁకఱింతు సురభిమూర్తియెదుట

స్వస్తికి మున్ముందు గవీ
శస్త్రావిర్భూతి వలచుజాతిని సురభి
ప్రస్తుతి సకలాఘుంబుల
శస్తంగతి యున్నజాతి నభినందింతున్

ఏతపము లేవ్రతమ్ము ల
హా! తీర్థము లెవ్వియెవ్వియును గోహత్యా
పాతకము నార్ప వని నా
జాతి గదా నిల్చి ధర్మసందేశమిడెన్

గోవులు లేనియిండ్లు పసిగోడెల ముద్దుల చెంగనాలకున్
దావులు గానిబీళ్ళు మఱి తండ్రులవోలె సమస్తసంపదల్
ప్రోవులు సేయు నెడ్లసిరి పొంగని చావడు లెన్నియున్నఁ ద
జ్జీవన మీజగంబున రుచింపదు నింపదు తృప్తి నెన్నఁడున్

నిదుర లేచి తెలి యెదుటికొట్టమ్ములో
గంతు వైచు పెయ్యఁ గౌఁగిలించి
ముద్దులాడి వత్స ముఖముదము నాసంతాప
రాశి నడఁచు కప్పూరంపుహ్రదము

దధిమథనవేగ విచల
న్మధుకరవేణి సువర్ణమణివల యోద్య
న్మృదునాదమ్ములు కమలా
పథమ్ము లెవ్వాఁడు మఱచుఁ బ్రాభాతికముల్

"పాఁడి గలదే" యన్నప్రశ్న మున్ముందుగాఁ
బుట్టుఁ జుట్ట మిల్లు మెట్టెనేని
పంట చదువు సంధ్య పాపలకల్మి యే
పాటిదేని పాఁడిసాటి గాదు

సంపదలఁ బెంచుపశువుల
కింపవు నేగడ్డియైన; నిది యేమి సిరిన్
దంపెడినరులకు నింతయు
నింపవు పాకమ్ము లెన్ని యేర్చి యొసఁగినన్

భోగము మరగిన మానవు
రోగమ్ము నడంప నెందఱో కల రెందున్
త్యాగము వలచిన ధేనువు
యోగమ్ముఁ దలంప నెంద ఱున్నారు మహిన్

౨౩-౫-౪౯

# చిన్నయసూరి

అంకిలిలేని పాండితియు నన్యదురాసద శాబ్దికత్వపుం
బొంకము నీక దక్కెనది పొమ్ము! తెలుంగుల నెల్లకాలముం
లెంకలఁ జేసికొంటివి బళే! కనుసన్నలఁ గోవిదాళిచే
సుంకము లందికొంటివి యశోనిధి వైతిగదయ్య చిన్నయా

గాసట బీసటల్ సదివి కర్జ మెఱుంగఁగలేక సంతతా
యాసమునందు సోదరుల నారసి వాఙ్మయవారిధి శేముషీ
భాసురమంథదండమునఁ బట్టిమథించి సుధీజగత్తు కే
బాసన లక్షణామృతము పంచితి వంచితవైభవంబునన్

పురుషార్థము తురీయము నెఱుంగఁ గోరుచో
నుపనిషద్రాజమై యొప్పుదాని
భాషాస్వరూపంబు పరికింపనెంచుచో
శబ్దలక్షణమై యెసంగుదాని
లోకజ్ఞతా విశేషాకృతుల్ సూచుచో
నీతిశాస్త్రంబయి నెగడుదాని
చేతోహార రసానుభూతి నర్థించుచో
నుత్తమకావ్యమై యుండుదాని

సకలధర్మతత్త్వసారమై విశ్వజ
నీనమై వెలుంగు నీతిచంద్రి
కను రచించి తెల్గుజనయిత్రి కిచ్చు నీ
పుట్టు ధన్యమయ్యెఁ బో! కవీంద్ర!

వ్రాయఁగవచ్చుఁగబ్బములు వందలు వే లెటులో శ్రమించి దే
శీయులు వానిఁ గైకొని భజింపరయే నవియేల? భాస్కర
చ్ఛాయలు నీదుసత్కృతులు సంచరణం బొనరింపకున్న చో
టీ యఖిలాంధ్రభూమిఁ గలదే! వలదే! యిటువంటిభాగ్యముల్

జాతిద్వేషపిశాచదాస్యమున కిచ్చు న్మెచ్చు దుశ్చిత్తులన్
నీతిత్యాగులఁ నిన్ సమస్తవిబుధానీకస్తుతున్ జేరు వి
ఖ్యాతిన్ దూల్పఁగడంగి దొంగకృతులన్ గల్పించుదోషజ్ఞులన్
జేతోవీథిఁ దలంచువారలకు నిన్నే! రోఁత వాటిల్లదే?

ఏతద్దుష్కృతు లెంతచేసినను నీ కేలోటు వాటిల్ల దీ
ర్ఘ్యాతీతుల్ సమబుద్ధు లుత్తములు సంఖ్యావన్మణుల్ సూనృత
ప్రీతుల్ పూతచరిత్రు లీజగతి లేరే? పల్వు రుత్సాహులై
చేతఃపూర్వకగౌరవం బొసఁగి నిన్ సేవించు తెల్గుంబ్రజల్

* వేంకటరమణుఁడు సూనృత
కింకరుఁడై ధూర్తవిబుధకృత్రిమసృష్టిన్
జంకక చాటఁడె విద్వ ద
లంకృతి కాతనికి మ్రొక్కులం బచరింతున్

ఎందాఁక గౌతమీ కృష్ణవేణీ తుంగ
భద్రా స్రవంతులు పరువులెత్తు
ఎందాఁకఁ దెల్గుల కిలువేల్పులై వేంక
టేశుండు లోకంబు నేలుచుండు

---

* దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు.

ఎందాఁక నమృతనిష్యంది కవిత్రియ
రచితకావ్యంబు భారతము వెలయు
ఎందాఁక నాంధ్రుఁడ నే నంచు భావించు
మానిసి జగతిపై మలయుచుండు

ప్రాక్పయోనిధివీచికాపాణిదత్త
మర్ఘ్యపాద్యాదిపూజనం బందికొనుచు
నీ తెలుఁగుతల్లి యెందాఁక నెసఁగుచుండు
నీకు దక్కినకీర్తి యందాఁక నిలుచు

ఉన్నయ్యలలో దివికిం
జన్నయ్యలలో నెవండు సరి ? తెల్గుపసల్
కన్నయ్యకుఁ బరవస్తువు
చిన్నయ్యకు నీకు నాంధ్రచింతామణికిన్

౧౬–౨–౩౫

# మొల్ల

మల్లెలు పూచెఁబో! మలయమండల మారుతశాబకంబు ల
ల్లల్లన వీచెఁబో! చవుల కాశ్రయముల్ మకరందవాహినుల్
వెల్లువ లయ్యెఁబో! తెలుఁగుసీమ కపూర్వయశంబొసంగుచున్
నెల్లురిమొల్ల రామధరణీపతిపుణ్యచరిత్రి పల్కఁగన్

కుమ్మరిపిల్లవంట పలుకుంజవరాలికి నీకు బాంధవం
బెమ్మెయి నబ్బె నీకుఁ జదు వెవ్వఁడు సెప్పె నుదారతానిధా
నమ్మగు నమ్మహాపురుషునామము సెప్పెదవేని హృద్యప
ద్యమ్ము లొసంగి వాని శతధా నుతిసల్పుదునమ్మ! సోదరీ!

తెలుఁగులనోముపంటయగు తిక్కనకావ్యము తాటియాకుపైఁ
దొలుత లిఖించుభాగ్యమును దోఁచిన వ్రాయసగానికోవలో
మొలచినమొక్క వా చరితమున్ వినిపింపుమ యట్లుగానిచోఁ
గలుగునె నీకు నింతనవకమ్మునఁ గబ్బముగూర్చు నేరుపుల్

చూచినయంతనే చదువఁజొచ్చినయంతనె యర్థభావముల్
పూచి ఫలించునేని యదెపో! సుకవిత్వపదంబు నందఁగా
నోఁచిన కైతయుం చతిమనోహరఫక్కి వచించి నీప్రతి
జ్ఞాచరణంబు సార్థకమ యౌనటు సల్పితి వింతయొప్పునే!

౬-౪-౩౮

# ఆస్థానకవి

కింకవిరాజ మత్తగజ కేసరియై తెలుఁగుం గవిత్వపుం
బొంకములెల్లఁ జూపిరుచిపోయిన శారద సోయగంబులో
వంకలు దిద్ది సత్కవుల వందల వేల సృజించె నెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్

అంకిలి లేనిధాటిని సహస్రవధానము లాచరించి స
ర్వంకష నైపుణుల్ మెఱసి వారిక వీరికి నంధ్రసాహితీ
కింకర తానురక్తి నొలికించి రహించినవీరుఁ డెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్

జంకని శేముషీపటిమ సాయముగా ననిరుద్ధవృద్ధతా
పంకమునందుఁ జిక్కియు నభంగురశిల్పసమగ్ర నూతనా
లంకరణమ్ములన్ నుడి వెలందికిఁ బందువు సేయు నెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్

శంకలవోలె నెవ్వనిఁ జలింపనిభక్తి భజింతు రాంధ్రు ల
భ్రంషకీర్తి పెంపున సుపర్వధునీవిహారన్మరాళి శా
హంకృతిఁ దూల్చు నెవ్వఁ డజరామరవాఙ్మయమూర్తి యెవ్వఁ డా
వేంకటశాస్త్రి కంచిత కవిత్వ విధాతకుఁ గేలుమోడ్చెదన్

ఓకవిసార్వభౌమ ! భవదుజ్జ్వలయోగ మపూర్వ మెన్నఁడున్
నీకడ రామశబ్దమును నేర్చు టెఱుంగనివార లెందఱో
మాకును జెళ్ళపిళ్ళకవి మండనుఁడే గురుఁ డంచహో నమో
వాకము లిచ్చి నిన్నుఁ గొలువన్ బులియున్ గనువారిదంతముల్

మాటలు పెక్కేలా తొలి
నాఁటికవిబ్రహ్మ తిక్కనప్రభుఁ డీవో
నేఁటికవిబ్రహ్మవు నీ
నాటినమల్లియలు తెల్గునాఁటికవీంద్రుల్

తోఁటఋవజాతి నీయది
యాటన్ దోహదము కరతలామలకంబై
వాటిల్లె నందనవనీ
వాటీసౌరభము నీదువనవీధికలన్

చెన్నరాష్ట్రపరిపాలకుల్ శతముఖశ్రీమత్కళాసాగరున్
సన్మానస్థానకవీంద్రుఁ జేసిరటె యాంధ్రీకీర్తిచిహ్నంబుగన్
నన్నెచోఁడులనాఁటివైభవము కన్నారిచ్చుటన్ దెల్గువా
రన్నా! పున్నెములెల్లఁ జేరినవి సహ్యాగ్రావజాతీరమున్

కంటిమె యిట్టివింత సరకారు కడుంగడు గాసి కోర్చి నీ
యింటికె వచ్చి నీకు బిరుదిచ్చిరి మెచ్చిరి కానుకపెట్టి; నీ
వంటికవీంద్రుఁ డిట్టివిభవమ్మున కర్హుఁడ కాని దీనిఁ గ
న్గొంట ప్రజాప్రభుత్వమునకున్ సరిక్రొత్తవెలుంగుఁ దెచ్చెడిన్

రాచఱికమ్మువారు కవిరాయని కిచ్చుటఁ బుష్పమాలికల్
వై చుటఁ జేసి యీవిజయవాడ తెలుంగులరాచపీడు గా
నోఁచినమాట నూటికిని నూఱువిధాలయథార్థ మమ్మహా
రోచికి నేఁటిపర్వ మవిరుద్ధ ముపశ్రుతిగాఁ దలంచెదన్

౭-౯-౪౯

# క వి రా జు

యుగయుగమ్ములు బొజ్జ నునిచి కృష్ణమతల్లి
యాంధ్రలక్ష్మి కోసంగు నమృతకలశి
అందందుఁ జెదరి సొంపఱి నేఁటి కొక్కచో
ముద్దగట్టిన ముద్దుముద్దు తెలుఁగు
దివి నున్న సకలాంధ్రకవిరాజరాణ్మహః
ప్రాతినిధ్యము బయల్పఱుచు వెలుఁగు
శ్లాఘావిలంఘన జాంఘికప్రతిభ చేఁ
గమనీయకావ్యముల్ గన్న గేస్తు

ఏడుదీవుల కవ్వాల నేపుసూపు
కొండనెత్తమ్ముపై నై జగణాలతాళి
కల్లువెట్టిన గడుసరిహాలికుఁడు
త్రిభువనీపూజ్యతముఁడు మాత్రిపురసుకవి

కృత్స్న వేధస్సృష్టికిని మాఱు కల్పించి
సడిసన్న గాధిపుత్రుఁడవు నీవు
విశ్వకల్యాణంబు వెలయింప జీవముల్
ముడుపుగట్టిన శాక్యమునివి నీవు
దుర్వాద కుర్మత ద్రుచ్ఛిదావిధిలోన
రాటుదేలిన కుఠారంబ వీవు
నిఖిల ధర్మాధర్మనిర్ణేతవై జగ
ద్గురుపదం బేలు నూతఋషి వీవు

తెలుఁగుకావ్యమ్ముపైఁ గోర్కి తీవరింప
సురల వీడిన కాళిదాసుఁడవు నీవు
పరిణతాంధ్రప్రసూతపఃఫలమ వీవు
త్రిపురనేనికవీ ! నీ కిదే జోహారు

సన్నని సంస్కృతాంధ్రములసారులు గుప్పెడు నీ కలమ్ములో
నన్నయతిక్కనల్ కదలి నాట్యము సేయుదు; రాంధ్రవాణి బల్
ప్రన్నని హైమనూపుర ఝుళంఝుళలన్ లయ చక్కదిద్దు నీ
కెన్ని భవంబులం దొరదవె నింతటి పుణ్య మగణ్య మగ్రజా !

వెన్నెలజల్లు సౌరవనవీథులు పంపెడి కమ్మగాలి క్రొం
గ్రొన్ననపచ్చతేనె జిలుఁగుంగపురంపుబిడారు తెల్గులేఁ
గన్నెపసిండిమట్టెబయకారిఘులంఘుల నీదు కైతకుం
జిన్నరితోడఁబుట్టువులు సెప్పఁగ నేటికి నీ యదృష్టముల్

క్షత్రకులంబునందుఁ గవిసత్తము లెందఱో లేరుగాని లో
కత్రయమేసి కిమ్మనదుగా ననెచోడనితో నృసింహరాట్
పుత్రుఁడు కృష్ణరాయకవిపుంగవుతోఁ దమతో సదృక్షులై
ధాత్రిఁ బ్రసిద్ధిగన్న కవితల్లజు లెవ్వరు పేరు లేరన

చాళుక్యనరపాల సంపత్పయోధిలో
మునిఁగి తేలినవాఁడు మొదటి సుకవి
మనుమసిద్ధిని పెట్టిమామయ్యా నొనరించి
దిక్కు లేలినవాఁడు తిక్కయజ్వ

రడ్డివేమన రాజ్యరమ లేఁతనవ్వులోఁ
జివురించినాఁడు కాశీప్రబంధ
సార్వభౌముని భుజాస్కంధమ్ముపై నెక్కి
తద్ద వెల్గినవాఁడు తాతగారు

గ్రుడ్లు ఱిక్కించి పెదవులు కొఱుకుకొంచు
నబ్రపడఁబోము వీరి కావ్యమ్ము లరసి
ముసురుకొన్న దిగుళ్ళలో మున్కలిడుచు
నెట్లు సూతపురాణ మూహించితయ్యా

తెన్నాలిన్ నివసించి ప్రౌఢకవితా దీప్యన్మతిన్ రామకృ
ష్ణన్నన్ మ్రింగితి వంతఁ బోక గురజాలామాత్యు రేచర్ల బ్ర
హ్మన్నన్ జీర్ణము చేసికొంటి విఁక మా హాస్యైకకృతి నీ మాట కా
దన్నన్ గెల్తుము కోర్టులోన భయమేలా మాకు బారిష్టరూ!

గురువులు నేర్చునాఁడె గురుకుంజరుఁడౌ చెళపిళ్ళశాస్త్రి కా
దరువయి కొప్రపుంగవులధాటి కెదుర్కొని పౌరుషప్రభల్
కురియుట కేమి యీ గడియకున్ సడలింపని కాసెకోకతో
దురము దురం బటంచు రణదోహలముం బ్రకటింతు వీవనన్

ఎన్నో బాధలు ప్రాణగొడ్డములు నిన్నే డాటలాడింపఁగా
విన్నంబోవక జాతిగౌరవసమావిర్భాశకై నీతికై
యన్నా! సర్వము ధారవోసితివి నీ యౌదార్యమున్ శేముషీ
స్కన్నుల్ దున్నలు మన్నుజెట్టు లెఱుగంగా లేరు వీరాగ్రణీ!

నేఁటికి వక్కలాకు లిడనేర్చిరి నీకుఁ దెలుంగువార లీ
నాఁటికి మెచ్చుకొంటయు మనస్సున కించుక శాంతిఁగూర్చులే
మాటల కేమిపో తెలుఁగుమానిసివై మఱి కమ్మబిడ్డవై
పాటిలకున్న ని న్నెపుడొ బంగరుపువ్వుల ముంచియెత్తరే

కత్తిపోటును మించిన కలముపోటు
మాటతీపిని గెల్చిన మనసుతీపి
* సంఘశక్తిని మీఱిన జాతిశక్తి
నీక చెల్లుఁగదోయి! శంబూకసుకవి!

౧౬-౨-౪౨

## ద్వారమువారు

చిన్నారి తెలుఁగింటి కన్నె బంగరుటందె
వలకారి జిలుఁగుసవ్వడులు దిద్ది
గౌతమీ కృష్ణవేణీ తరంగచ్ఛటా
పటుతరార్భటి హారి త్తటుల నింపి
తెలుఁగుభక్తులగుండియల నూరి జాల్వాఱు
తేటపాటల తీరుతీయ మరసి
ఆంధ్రగీతిప్రపంచా శేషమృదురవ
స్ఫురణ కాచార్యకంబును వహించి

---

* కులాభిమానము

లలిత కర్ణాటగానకలా సరస్వ
తీ సవిత్రి సమర్చనాధీనవృత్తి
నలసిపోయిన గీతరత్నాకరునకు
నేఁటి సన్మాన మొక్కపన్నీటిజల్లు

పోయినచూపు లోపలికిఁ బోయి హృదంతర దివ్యలోక బృం
దా యమునాతటీ విహరణప్రవణ ప్రభు వేణునిస్వన
చ్ఛాయలఁ దెచ్చుకొన్న యొక చక్కనినాదము పొమ్ము నీ దహో
నాయకుఁడ! ముగ్ధులై మురిసినారు తెలుంగులు నీ కమానులోన్

జాతిని దిద్ది తీర్పఁగల జాణలు గాయకులుం కవీంద్రులీ
నీతి నెఱింగి ప్రాక్తనులు నేర్చిరి వీరి సమాదరించు; టా
తాతలనాఁటి ధర్మము, నుదారతయున్ దలయెత్తె నేఁటి కీ
క్రతులు సాగిసాగి చివురించుతఁ జిక్కళ లైన సత్కళల్

౧౯—౩—౪౯

# షష్టిపూర్తి

కందుకూరి సమాజసంస్కరణదీక్ష
చెళ్లపిళ్ల దివాకర శ్రీకవీంద్రు
శతవధాన పరంపరా సరిదఖండ
మధురకవితా ప్రవాహముల్ మలసిమలసి
తెలుఁగుబిడ్డలకన్నులు తెఱచువేళఁ
వెలుఁగులోఁగిళ్ళఁ దొలికోడి పలుకువేళ
నుదితమయ్యె సహస్రభానూజ్జ్వలార్చి
రూర్మిచలితంబు గ్రంథాలయోద్యమంబు

*    *    *

శారదామూర్తి యిది సుప్రసన్నఫణితి
నంబయై బుజ్జగించె నాంధ్రాళినెల్ల
నోజ్జయై తెల్గులకు వెల్గు లొసఁగనేర్చె
రాణిగా నేలెఁ దెనుఁగుమాగాణమెల్ల

*    *    *

వలదు పరతంత్రతాపీడ వలదటంచుఁ
దగదు బెంబేలుపడి స్రుక్కఁదగదటంచు
లెండు సమరానికి సాగిరం డటంచుఁ
దెరలె రణభేరి సాబర్మతీతటాన

*    *    *

ఎవరుదూఁకిరి మంటలో నెవరుమాతృ
దాస్యభంజకసవనతంత్రస్వతంత్ర
హోతలై పొల్చి రపరాజితోగ్రశౌర్య
నిధులుగానిల్చి, రీతెల్గునేలఁ జెప్పుఁడీ !

*　　　*　　　*

భారతీపాద కనకమంజీరజనిత
ఘల్లులారాన మెచ్చోటఁ గడలుకొనియె
సార సారస్వతాంసు లేచాయఁ బ్రాఁకె
నచటనేలేచి రాంధ్రయోధాగ్రగణ్యు
లచటనేపూచె జాతీయతాగమంబు
లచటనే పుట్టినారు మహాకవీంద్రు
లచటనే కానఁబడిరి మహాస్రమగు్రి
లచటనే సాధుసౌందర్య మవతరించె

*　　　*　　　*

ఎవ్వఁడీ యభ్యుదయలక్ష్మి కిచట విత్తు
నాటె, నీరెత్తె నే తెల్గుతోఁటమాలి
యెవ్వఁడీ చైత్రరథవాటి యువతళించి
సురభిసుమనః కదంబమై సొంపుగుల్కఁ
బాటువడె నన్నపానముల్ మాటమఱచి
యెవ్వఁ డీజాతి రతనాల దివ్వెయయ్యె
నెవఁ డుపఘ్నమై నిల్చె సాహిత్యలతకు
నెవఁడు సర్వస్వమయ్యె సాహిత్యపరుల

కతనిఁ గాం ధ్రసవిత్రీ ప్రియాత్మజునకు
నిస్తు లాయ్యాంకి వంశాబ్ధికౌస్తుభమున
కమరకీ ర్తికి వేంకటరమణామంత్రి
కంధ్రసేవానిమగ్నున కంజలించి
షష్టిసంపూర్తి సమ్మాన సంపదిష్టి
కన్నలుం దమ్మ లీనాఁడు పన్నిరనినఁ
బెద్దలుం బిన్న లీనాఁడు పేర్చిరనిన
నక్కసెల్లెండ్రు హారతు లద్దిరనిన
నద్దిరా! వెలువడ్డ సత్యంబ దేమి
నల్లవో! తేటపడ్డ విన్నాణ మేమి
తెలుఁగు బిడ్డలు సత్కళాధీనమతులు
తెలుఁగువా రార్యపూజనాధీనమతులు
తెలుఁగునాఁ డుత్తమాచారధీసమగ
మాంధ్ర మాచార్య మన్యదేశౌఘమునకు
నాంధ్రసంస్కృతి మోహానం బనుట గాక

* * *

జాతి నిటు దిద్ది తీర్చెడి జాణపట్ల
జాతికై కొల్వు నెఱపు సచ్చరితుపట్ల
జాతికై బలివోవు సజ్జనునిపట్ల
జాతికిం బ్రాణమిడు కళాసమితిపట్ల
జాతికిం గీర్తి సంధించు సరణిపట్ల

మూరిఁబోయిన యాభక్తి గౌరవములు
చివురుదొడిగిన యాప్రేమచిహ్నశతము
నిచ్చలుం దెల్గుబిడ్డలో నిలుచుఁగాక
నిత్యమై తెల్గుగడ్డలో నెగడుఁగాక!

౧౨–౧౦–౫౦

## మా ధ వ పె ద్ది

ఎందఱు లేరు నేఁడు సుకవీంద్రు లఖండకవిత్వరాజ్య సం
క్రందను లంధ్రవిశ్వజనగౌరవభాజను లట్టివారిలో
నెందఱికబ్బె నీకు లభియించిన యించిన కూర్పునేర్పు లో
సుందరరామశాస్త్రి! నినుఁ జూచుటె పండువు తెల్గువానికిన్

౧౧–౧౦–౪౨

# పట్టాభిషేకము

ఐ

తెల్లమొగాలతోఁ గడు విధేయతతోఁ బసిలేటి చూపుతోఁ
దెల్లమొగాల కారతులు దీవన లిచ్చెడి దుర్దినమ్ములోఁ
బల్లెలు పట్టణంబులును బ్రబ్బిన నిద్దుర నున్న జాములో
వల్లభుఁ డయ్యెలే తెలుఁగువాఁ డొకరోజున దానికేమి "మా
తల్లి విపత్తు మాన్పి పరితాపము లార్పి దురంత దాస్యపున్
బ్రేళ్ళు కదల్చి లోకమున వీరులమై తలయెత్తి నిల్వ మా
యెల్లసుఖమ్ములున్ సిరులు నీ తనువుల్ తృణముల్గదా! యనీ!
క్రుళ్ళిన కంపుగొన్న బ్రదుకున్ బ్రదుటియేని భరింపఁజాల" మన్
వెల్లువ పొంగి పొర్లి వినువీధికిఁ దన్నిననాఁడు ధాత్రి కం
పిల్లిననాఁడు భారతము పేర్చి పెనంగిననాఁడు శంఖముల్
చిల్లులు పడ్డనాఁడు తన చేవలు సేవలు త్యాగసంపదల్
పెల్లు వెలార్చి యార్చి రిపు భీకరుఁడై యెదుఱొమ్ముచూపి ఆం
పిల్లి యశమ్ముగన్న పులి పిల్లకు భారతమాతృ పూజకై
తల్లడపాటు లేని బలిదాన మొసంగిన తెల్గుబిడ్డ కే
నల్లన లేని జోదునకు నాల్గుదెసల్ జయపెట్టు ముత్తెపుం
జల్లులు చిందఁ దూర్యముల సందడి రేఁగఁ దురంగ కింకిణుల్
ఘల్లున మ్రోఁగ సత్కవులు కబ్బములం గొనియాడ గాయకుల్
పల్లవి పాడఁ గ్రొంబసిఁడిపళ్ళెము లెత్తి నివాళి పట్టి సం
ఫుల్ల సరోజనేత్ర లతిపూతచరిత్రలు బొట్టు దిద్ద రా

ట్తల్లజూనట్లు పుణ్యములు దాల్చిన రూపమునట్లు వచ్చి య
ల్లల్లన హైమరుక్కబళి తామ్రభము కాంగ్రెసు పీఠమెక్కు భా
గ్యోల్లసనం బి.కం గలుగదో! తగదో! యిది యేమివింత యీ
వల్లడి కేమిహేతు వనవద్యగుణమ్ముల నాంధ్రపుత్రుఁ డే
బల్లిదుఁ గ్రిందుసేయఁ డలబాబులు బోసులు దాసులుం బటే
ళ్ళల్లము విచ్చి చూడ మనయోధుల మించెదరా యటంచుఁ జిం
తిల్లిన తెల్గుతల్లి కతిదీనత సైఁచిన తెల్గుజాతికిన్
మల్లెలు పూచెరా! మలయమండల మంజుల వాతపోతముల్
మెల్లన వీచెరా! నిరుపమేయమనీషకు నాలవాలమై
యెల్లలు లేని ధీరతకు నిల్లయి శూరతకున్ నిధానమై
పొల్లొకయింత లేని నుడి పొందికకుం గుదురై జగత్తునన్
జెల్లెడు లెక్కలెల్లఁ దనచేతి కనిష్ఠను జూపు యంత్రమై
నల్లవో! మోహనుండు ఋషినాధుఁడుపల్కిన ఋక్కురూపముల్
తెల్లము సేయఁజాలిన సుధీమణియై ప్రతివాది ప్రక్కలో
బల్లెమునై విపన్నులకు బంధువుఁడై పగవాని మృత్యువున్
నల్లను వాంఛసేయని రణమ్మున నోటయొకింత లేని, యే
యల్లరి పాలుగాని మగఁడై ఫలమొల్లని కర్మయోగియై
పల్లము మెట్టయున్ వఱద పాలయి వెట్టకు నుగ్గుమాచగా
గొల్లునఁ గాఁపులుం బెఱలు కూడును గుడ్డయు లేక యేడ్చినన్
గొల్లలు మానఁబోక ప్రజకున్ దగుపెత్తన మీక గర్వముల్
తుళ్ళఁగ నింద్రభోగములతో సకల వ్యసనాలతోఁ బగల్

త్రెళ్ళుట చీఁకటుల్ కవియుదెంచు మెఱుంగక మత్తులై ప్రవ
ర్తిల్లు నరేంద్రులన్ బోఁగరుదింపి విధేయులఁ జేసి యేడ్తెఱన్
జల్లిన వీరుఁడై ప్రజల సత్కృతు లందిన యోధుఁడై విరా
జిల్లిన భోగరాజకుల సింహము కాంగ్రెసునేత యయ్యెరా!
ప్రల్లదుఁ డొండు పేల్చిన తుపాకి మహాత్మునిఁగూల్చెఁగాని యా
చల్లని తండ్రి ధర్మమును జంపఁగ లేదను వార్త నేఁడిటుల్
వెల్లడి యయ్యెరా! భువన వీధుల నాంధ్రజయస్వనంబు పిం
పిళ్ళు వెలార్చెరా! జననిపీడలు వోయిననాఁడు దైన్యముల్
బల్లున వ్రీలునాఁడు నవభారతలక్ష్మి యనుగ్రహమ్ము సం
ధిల్లుట కెల్ల ఖండములు దేశములున్ వెలలేని కానుకల్
ముల్లెలు పంపునాఁడు నలుమూలల స్వేచ్ఛ నటించునాఁ డహో!
ఫెళ్ళున సాగి రాష్ట్రపతి పీఠము నెక్కుట లెస్స యంచు దే
మొల్ల నదల్చు కీర్తికి నిమూలల మటంచు మదిందలంచి యి
న్నాళ్ళు సహించెనో తెలుఁగు నాయకుఁ డీపద మాక్రమింపఁగన్
భల్లరె! భోగరాజకుల పావన! నీ తలఁ పెంత యౌచితీ
వెల్లితమోయి! యెంతటి వివేకము నేర్చితివోయి! యింతకుం
దొల్లి యెఱుఁగనట్టి యకుతోభయతన్ జయపూర్వమహాసభన్
ఖిల్లలు పెద్దలుం జెలఁగి పింపిసలాడ సువర్ణరత్నరుగ్
వల్లరియౌ కిరీటమును వర్ణితమున్ ధరియించి కుట్రకుం
గల్లకుఁ బేరువడ్డ రిపుకాండము బమ్మెరవోవఁగా రథం
బుల్లలితంబు బొనర్చి భరతోర్వి యశంబును బెంపవోయి! నీ

యిల్లు తెలుంగుసీమ జగదీడితమై కెడనాఁడు లర్థిమై
నుల్లెడపట్ట రాష్ట్ర విజయోత్సవడోలల నూఁగు లగ్నమున్
ఢిల్లిని దెల్గు మంత్రులు పటిష్ఠితమై హావణిల్లు భాగ్యమున్
బల్లవ పుష్పగుచ్ఛ ఫలబంధురమై మన గాంధి భావనా
వల్లిక సాగు యోగమును వచ్చునటుల్ కృషి సల్పవోయి! నీ
కొల్లమి రానియట్లు సిరియుఁ జవమున్ బల మాయువబ్బి వ
ర్ధిల్లెడునట్లు నీ ప్రభుత దీర్ఘతరంబగునట్లు నీవు హాం
బల్లకి నెక్కునట్లు జయభారతి హారతి నిచ్చి మెచ్చుతన్!

౮-౧౦-౪౮

# అనుతాపము

శ్రీమన్మగధరాజ్య సింహాపీఠికమీఁద
నాంధ్రరాజన్యు లున్నట్టివేళ
పలునాఁటి నెఱజోదు బ్రహ్మనాయని కీర్తి
వల్లికల్ సకలోర్వినల్లు వేళ
వీరప్రతాప భూవిభుఁడు ఢిల్లీనాథు
సేనాళి నవలీలఁ జెండు వేళ
కర్ణాట భూభర్త కవిచక్రవర్తికి
స్వర్ణాభిషేకంబు సలుపు వేళ
విశ్వవిఖ్యాత బొబ్బిలి వెలమ వీర
చండశౌర్యార్చి దిక్కుల నిండు వేళ
నాంధ్రజనని ! న న్నీవు కన్నట్టులైనఁ
గటకటా ! యింతదుఃఖంబు కలుగ దిపుడు

౧౮—౯—౨౮

## విశ్వదాత

తరలినాఁడా మాతృదాస్యపాశచ్ఛేద
    కౌశల్యమును గన్న కర్మయోగి
కానరాఁడా బలికర్ణమాంధాతల
    విస్మృతికిం దెచ్చు విశ్వదాత
ఏగినాఁడా జగజ్జేగీయమాన సా
    హిత్య సామ్రాజ్యంబు నేలు బుధుఁడు
పోయినాఁడా దివ్యభూషణమ్ము లొసంగి
    చదువులమ్మకు సేవ సలుపుబంటు

తెలుఁగువెల్లులకొఱకు రాత్రిందివమ్ము
రక్తమును ధారవోసిన రాచబిడ్డ
యస్తమించెను నాగేశ్వరాభిధుండు
దేశమున కెవ్వఁ డీలోటు తీర్చు నకట!

౧౩—౪—౩౮

## ఓదార్పు

కనుసైగచేసినకలికి మేనక కెంత
    సవురున్న నది సంతసాని కాదో
తోడుగోరిన జయంతుఁడు సాధువైనను
    మిండగానికిఁ దనూజుండు గాఁడో
గీర్వాణ మెంతసీల్గిన జిల్బిలి తెలుంగు
    నుడిసొంపునకు దిగదుడుపు గాదో

అమరలోకము నాక మందువా యగుఁగాక
విడుపులేనిసుఖంబు వెగటు గాదొ
మందార మెంతకమ్మన పంచిపెట్టిన
జవ్వాజి దాని కాశ్రియము గాదొ
పీయూష మెంతయింపిత మైన నది యావ
కాయయూటకుఁ గ్రిందిచేయి గాదొ

ఏమి బావుకొంట కేగితి వాగాము
లింత గనక వైజయంతమునకు
వేయి చెప్పవయ్య * వేంకటరామయ్య!
శాస్త్రి వయ్యు నీవు ఛాందసుఁడవు

బహిరంతర సుందరతా
మహానిధి భవత్కుమారమణి ఫణిదంష్ట్రా
విహార జ్వలనార్చిస్తతి
నిహతించెనె లక్ష్మణావనీపాలమణీ!

ఎటు లీశోకము నుక్కఁబట్టెదవు నిన్నేరీతి నోదార్తు ము
త్కటసౌజన్యవిభాసివై మనెదు నీకా యిట్టి దుర్యోగ మీ
కటుకృత్యంబున కెట్టులోర్చె విధి; లోకంబెల్ల నీ బంధు వౌ
నటు భావించుచు బుద్ధిచెప్పఁగదవయ్యా! కూళ కవ్వానికిన్

౩-౧-౮౩

---

* జమీందారు శ్రీ జవ్వాజి లక్ష్మయ్యనాయఁడుగారి కుమారుఁడు. వేంకట రామశాస్త్రి.

# ఆవేదన

అతఁడు తెల్గులతల్లి పుణ్యమ్ముపంట
యతఁడు తెల్గులబాస భాగ్యంపురాశి
యతఁడు కవిరాజ సంఖ్యావదగ్రిణ్యుఁ
డేల పుంభావభారతియే యతండు

అతని గంభీర కవితా రహస్య మెఱిఁగి
మేలు మేలనువారు వేల్వేలె కాని
బెగ్గడిలి యీరసంబెత్తి మ్రగ్గుచున్న
వారు లక్షలు లక్ష లున్నారు జగతి

కల్పమునఁబోని యుత్తమ కావ్యసృష్టి
వాని కలవోక వాణి యవ్వానిరాణి
యతనికి వచోవిధేయమ్మై యఖిలశాస్త్ర
పటలమది భీతిమై బరాబరులొనర్చు

అతఁడు పల్కిన పల్కు పాటై ధ్వనించె
నతఁడు వాక్రుచ్చు వాక్యంబు హారి కావ్య
రాజమై దేశదేశాల రాణకెక్కె
నతని హృది రసవాహినియై తొణంకె

అతఁడు మహాకవిత్వ దీక్షావలంబి
యగుచు నంతర్విలోకనం బట్టె విప్ప
యుగయుగమ్ములు దాఁటిన జగములెల్ల
రివ్వు రివ్వున సాక్షాత్కరించితీరు

కుకవులకు నాతని విమర్శ గుండె గాలు
మల్లబుద్ధుల కేనాఁటి కందఁ డతఁడు
ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన పండితుండు
పండితుఁడె కాదు పండితాఖండలుండు

తెలుఁగు హృదయమ్మునందున్న తీపి నెఱిఁగి
తెలుఁగు నుడికార మందున్న మెలపు నెఱిఁగి
తెలుఁగు సంస్కృతియందున్న చెలువ మెఱిఁగి
తెలుఁగున కతండు సరిక్రొత్త వెలుఁగు లిచ్చె

ఇంతటి కవీంద్రు లేమిడి యిట్టిదనుచుఁ
జెప్పుటకు నాదు లేఖిని సిగ్గువడియె
నిస్సిరో ! యెంత దుష్కాల మీ తెలుంగు
జాతిలోఁ జీమునెత్తురుల్ సచ్చెనో కొ

కవితా రసాస్వాద కౌతుకవ్యగ్రులై
దండయాత్రలు నిల్పు దండిదొరలు
రమణీయ కావ్య సారస్వతావేశులై
కవుల పల్లకిమోయు నవనివిభులు
తెల్లవారకముందె దినవెచ్చముల నంపి
కృతికర్తలను గొల్చు పృథివిపతులు
కనకాభిషేక సత్కారమ్ములర్పించి
కవికృపావిభవంబు గాంచు ప్రభులు

స్వప్నల యాదార్థ్యమునకు వన్నియలొసంగి
శారదాపూజ లొనరించు సచివమణులు
నేటి కవిశేఖరుని దైన్యపాటు సూచి
కుములుచున్నారు చచ్చి స్వర్గముననుండి

బ్రతికినన్నాళ్ళు దుర్భరాపదలఁ గుడిపి
చచ్చినంతనె యాత్మకు శాంతివల్కి
వీరపూజలు గావించు వెఱ్ఱితనము
తెలుఁగు దద్దమ్మకే సమృద్ధిగ లభించె

ఇది వెఱ్ఱితనంబని ప
ల్కెదనా? మఱి తోడివాని గుణగౌరవ సం
పద కోర్వలేని నైచ్యా
స్పద మీర్ష్యాదాస్యమనుచుఁ బ్రకటించెదనా?

లోక మితనికి నేవమ్ము గాకమున్నె
యాఁకటికి డస్సి జీవముల్ పోకమున్నె
పట్టుఁడీ బ్రహ్మరథము నీ భావుకునకు
నవల నేడ్చిన లాభ మావంత లేదు

చవియు సారంబు నెఱుఁగని చచ్చుకవులు
పుట్టగొడుగులవలె సదా పుట్టుచుంద్రు
సర్వతంత్ర స్వతంత్రుఁడౌ సత్కవీంద్రుఁ
డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు

౮-౨-౩౮

# వంగభస్మము

సిగ్గు సిగ్గు తెల్గుసీమల దత్తు, ఠా
కూర్, బెనర్జి, సేను, ఘోషు, బోసు
రే, యటన్న పేర్లు రేఁగెను; పెగ్గడ
భట్టు, సెట్టి, నీఁడు వట్టిపోయె

మాడరన్ రివ్యూపై మమతఁ బెంచుటె కాని
కోలవెన్ను త్రివేణి కొనఁగఁబోము
రేల బోసుల బగల్ రేలఁ గొల్చుటె కాని
భగవత్సుధీశాస్త్రి పటిమ గనము
ఏముఖర్జీగీతమో మెచ్చుటే కాని
చదువ నొల్లము కృష్ణశాస్త్రి కృతులు
సెహాబాసని సుభాసు సేవ సల్పుటె గాని
భోగరాణ్మంత్రివైపునకుఁ జనము

ఎవ్వఁ డీవంగభస్మంబు నేముహూర్త
మందు మన కిచ్చెనో తక్కుమందులన్న
డోఁకు పుట్టించె; మంచిఘాటుగలదాని
వెదకుఁడు కషాయమును దీని వెడలఁగ్రక్క

అప్పుడు రామమోహనమహర్షి ముఖుల్ మన కేవిశేషముల్
సెప్పినఁ జెల్లెఁగాని బుధశేఖరులై ప్రతిభావిభాసులై
యిప్పుడు తెల్గువారె గడియించిరి విశ్వజగజ్జనాళికిన్
మెప్పిడి హక్కు సర్వోపలిమంత్రిపురోగము లెక్కవచ్చుటన్

౩౦–౧–౪౦

# చుక్కలు

సాచలసముద్రవిపిన
ధాత్రీచక్రము నెల్ల నైజమంజులరోచి
ర్వీచీమండలిఁ దన్పెడి
యీ చుక్కల పుట్టుచంద మేమందు రయా?

*  *  *

నిర్గతమోహోద్యసుహృ
ద్వర్గులు పగతత్త్వవిదులు "తమసో మా జ్యో
తి ర్గమ" యేతి వదన్ముని
భర్గులు దీపింతురా నభస్స్థలి సిట్టుల్?

*  *  *

ఋగ్యజుషసూక్తములు ఛాం
దోగ్యాదులు వినిచి మనిచి తొలఁగిన బ్రహ్మ
ప్రసగ్యంప్రతితమతు లారవ
ముగ్యవనిక నిట్టిరూపముల వెల్గెదరా?

*  *  *

అమృతప్రసువులు యాజన
క్రమకర్షణమూలములు సురధ్యేయము ల
గ్నిమయమ్ములు ధేనువు లీ
రమణీయాకృతులు రా విరాజిల్లు నొకో?

*  *  *

పరిణతపాతివ్రత్య
స్ఫురణత్వరమాణలై ప్రభూతత్యాగ
స్థిరలై పతిచితి నెక్కిన
తరుణీరత్నమ్ము లిట్లు తలఁచూపి రొకో ?

*        *        *

గంగాంభఃపరిభావిశీలసుషమాగారంబు లై చిత్తభూ
శృంగచ్ఛేదమునర్చిదుష్కరతపోర్చిరాసులై ప్రాయమున్
సింగారంబును జాతిధర్మపదవీ సేవార్థ మర్పించి మే
నిం గోల్పోయిన భారతీయవిధవానీకమ్ము లీ చుక్కలా!

*        *        *

వసుధారాజ్యమ్ములు గా
కసిపుత్రికఁ గోసి తనువు నర్థుల కిడి ధ
ర్మసపర్య మునిఁగి తేలిన
యొసపరి తెగుదారు లిట్టు లుండిరె చదలన్ ?

*        *        *

ఎత్తిన కటారి దింపక
నెత్తుటఁ దోఁగాడి శత్రునిర్మథనకలా
విత్తములై ప్రజ నేలిన
యుత్తమస్త్రమాట్టు లిట్టు లుందురె మింటన్ ?

*        *        *

పరిభావజనకదుర్భర
పరతంత్రత నెదిరి దేశభక్త్యుల్బణులై
యురికంబము లెక్కిన పో
టరు లంబరవేది నిట్లు శవణిల్లెదరా ?

*   *   *

పతితప్రజాసమాజో
న్నతికృత్సంస్కృతికి జీవనస్వార్థము లం
కితముల్ పచరించు తథా
గతాదులా నింగి నిట్లు క్రాలెడి రిక్కల్ ?

*   *   *

మసృణమకరందధారా
విసృమరపుణ్యప్రబంధవిరచనపరితః
ప్రసృతప్రథామహిష్ఠులు
రసజీవులు సుకవు లుందురా యీసరణిన్ ?

*   *   *

కాలెడి పొట్టతో విరతిగానని చింతలతో విశీర్ణమై
సోలెడి మేనితో బడుగుఁజూపులతో నిజరక్తమాంస కం
కాళము లర్థమత్తులకుఁ గానిచటన్ బలివెట్టి రెవ్వరా
మాలలుమాదిగల్ గగనమంటపమెక్కిరె యిట్లుచుక్కలై ?

౩౦-౧౨-౪౭

# ముక్త్యాలమాలిక

## (రాజసమ్మాన సందర్భమున)

గండరగండలై ప్రతిసుఖప్రద సాధుకథామచర్చికా
మండనులై మహిష్ఠగరిమన్ జతురబ్ధిపరీత మేదినీ
మండలభర్తలై భువనమాన్యతనొందిన తెల్గువారిలో
దండియశమ్ము నేలిన సదస్సుల కెక్కిన వాసిరెడ్డి రా
ణ్మండలిపుణ్యవృత్తసుషమాపరిపూతము తెల్గునేల-త
ద్భండనపాటవమ్ము ప్రతిపక్షభయంకరమౌట నన్యదో
శ్చండిమలేక శాంతిసుఖసంపద కిమ్మయి దక్షిణాపథం
బుండెనటన్న పల్కు నెదురొడ్డఁగ నాఁడును నేఁడు నేరికిన్
గుండెలు లేవు-వారల యకుంఠిత విక్రమకంకటమ్ముతో
నెండని తీవిగాంచి జగదీడిత వైదికధర్మమిచ్చటన్
బండువులాచరించుకొను భాగ్యమునందెఁ-దదీయదాతృతా
ఖండితదైన్యులై తనివిగాంచినయాచకులగ్రహార వే
దండతురంగ హేమమణిదానములన్ బరితుష్టిసంపదల్
మెండుకొనందలిర్చిన యమేయమనీషులు సత్కవిప్రభుల్
పండితు లార్షధర్మపరిపాలితబుద్ధులు సోమపీథులున్
నిండనిపల్లెలాంధ్రధరణింగన- మాస్తికతారిరక్షమైఁ
బిండులుగట్టి శిల్పములు పింపిసలాడఁగ వీరి మాతృభూ
ఖండమునందునిల్పు శివకైటభజిద్గృహరాజినెన్న శే

షండునుజాలఁ- డిద్ధగుణశోభితమైతగు నిట్టికోవలోఁ
బండిన రామకృష్ణనరపాలక ! నీ సుతుజన్మపర్వ ము
ద్దండవిభూతిమై వెలయు దానిఁ గనుంగొను భాగ్యమబ్బి నా
కండలుపొంగె మేనఁబులకల్ మొలకెత్తె నఖండహర్షమై
తాండవకేళిసల్పెడిఁగదా హృదయమ్ము- త్రిలింగరాజమా
ర్తండుల వాసిరెడ్డివసుధాపురుహూతుల వైభవంబులన్
వెండియు నెండియుంగనెడు వేడ్కలుపుట్టు టదేమివింత-యీ
పండుగు వర్ష వర్ష పరిపాటి సహస్రముగానెసంగ నీ
కండగనిల్చు వేదకుధరాగ్రవిహార్త జగద్ధితక్రియా
శౌండుఁడు నారసింహుఁడు- ప్రసాదమృదూకృతలోచనద్వయీ
* చండి యజాండభృజ్జఠరి శాంకరి కింకరమందిరాంగణా
ఖండలశాఖి నిర్భరసుఖమ్ముల నిన్నలరించు-మీఁగడల్
నిండిన రత్నరాజిరవణించిన యింటినిసుంగుచల్వ నీ
బండరు వెల్లవేళల నపారధనాశ్రియమాచు జాలువా
కొండనదల్చు-మాన్యకవికుంజరపుంజము లంధ్రభారతీ
కుండలముల్ కిరీటములు క్రొవ్విరిదండ లనల్పకల్పనా
ఖాండములైన కావ్యములఁ బాడి నినుందనుపారఁజేయు-నీ
తండిరి చంద్రమౌళివసుధాపతి కచ్ఛయశోవిభాసికిన్
బెండెరమున్న సత్కవులఁ బెంచినకావ్యకళావినోదికిన్
రెండవ రాజరాజునకు నీ కవితారతి సమ్మదస్రవా:

* చల్లనిదని యిచటి యర్థము

ఖాండముఃలూర్చు—నీసుతుల కమ్మనిమన్గడ గన్నవారికిం
బండులు బోరనం బులియఁబాఱు—భవద్భవనావళుల్ సుహృత్
♦ తండముతోడ బంధుసముదాయముతోడఁ బెనంగి భేరికా
డిండిమ కాహళీధ్వనులు డీకొని సందడిసేయ లేఁత యి
ల్లాండ్రు పికీనినాదముల నారతి పాటలుపాడ నిండుగా
వండిన భక్ష్యభోజ్యముల వాసన లాసలు పెంప సర్వదా
పెండిలి వేడ్క—లన్మనిఁగి పెంపగుఁ—జింతలపాటి రాజ్య మొం
డొండ తనర్చి నిత్యవిజయోత్సవ కందముగన్—హిరణ్యముల్
మండెలువైచి నీప్రజలు మాన్యచరిత్రల కాశ్రయంబులై
వేండ్రము లేని డెందముల వేమఱు నిన్నునుతింతు—రద్రికో
దండపటీరహీరహిమధామశరజ్జలముఃగ్వియద్ధునీ
కాండ మరుద్గవీకనకగర్భవధూఫణిరాజమల్లికా
పాండురకీర్తి నిన్వలచి పార్థివకోటికి నీర్ష్యపెంచు—రా
రండని పిల్చి గౌరవధురానతదృక్కులు పంచి సాహితీ
మండితులైన సత్కవుల మాదృశుల౯ దనియించు నీకథా
మండల మొజ్జయై ధనికమార్గముల౯ సవరించు భూపతీ !

* * *

కొండొక విన్నవింతు వినఁగూడని కబ్బములల్లి గ్రామ్యముల్
బండులు బండ్లు నింపి కవిపాంసను లాద్యకవీంద్రమార్గముల్
దుండగికమ్మున౯ దెగడుదుర్ గద—బందరువాల్ ఫిరంగిలో

♦ ఈ ప్రయోగము శ్రీనాథుని 'కంకాళతండము' వంటిది.

మండలు ముందు లెల్ల కసుమాలపుఁజెత్తయుఁ గ్రుక్కునట్టు లీ
బండలు భారతిం బఱచి పల్కెఱునుబ్బుదు- "లేంది కాంది కూ
కోండి తెలీను రాం డిహా లెగుం" డని వ్రాసెద-రెల్లకట్టులన్
దుండెలు సేయుచున్న నుడితోయ్యాలి రెక్కొనదందు-రెట్లు వా
కొండు రటుల్ రచించుటయు కూడునటందు - రిదేమి యేటికిన్
గండులుపెట్టి స్వేచ్ఛనిడఁగాఁ దగునన్నఁ బాలంబులుం గొటా
ర్లిండులు పల్లెలుం బురము లెల్లయు వెల్లువగారె కగ్గమై
వండలి దిబ్బలై సమయవా-కరకట్ట ప్రవాహజీవికై
జెండునె-సూర్యసోములను జేద్పడఁజేసెనె కాలబంధముల్-
గండకు వందచందములఁ గాఱిఱుపెట్టి నగ్గై నలంచెనా-
పెండిలి సౌఖ్యములుమిచిపెట్టి నెలంతుక నంగలాయుపుం
బిండలిఁ జేసెనా - పసులబీటికిఁ గంచెలు గోష్ఠశాలకుం
బెండెము లేనిచో మొదవుపింఁడు సుఖించునె-మద్రాంగతా
పిండితబుద్ధు లాంధ్యపరిపీడితు లిత్తఱి నవ్యసాహితీ
షండ సపర్యలోఁ బెరిఁగి సత్యమెఱుంగక వెంగళిప్పలై
బెండులుపల్కు రిత్త వెడబీరముచూపెద-ర్ప్రసక్తిలో
మండఁ దొడంగు నాహ్వయముండల-మక్కట! తెల్లుగల్లికీ
పుండులు మానునట్లు పనిఁబూను-ముసుళ్లనఁ గ్రేళ్లువాఱు నీ
దండు నధఃకరించి కవితావనితాసుచితామనోజ్ఞతల్
గొండిలినప్పునట్టి తెఱఁగుల్ పచరింపఁగదయ్య-సాధుశీ
లుండు రసజ్ఞుఁడుం దెలుఁగులోఁతులెఱింగిన ప్రోడ రాజమా

న్యం ♦ డెలమావివంగడమునోఁచిన నోములమేలిపంట నీ
దండ నమాత్యుఁడయ్యెనుగదా శివరామమనీషి-సాహితీ
కందువ నీకునుంగలదు-గాన మదీయమనోరథాప్తికే
వందయు రాదటంచు వగవాసెదఁ-జేదులడంగి తీయ మేల్
పండులు తెల్గుదోఁటఁదెగఁబండునటుల్ ప్రయతింపవయ్య-కై
దండలొసంగుచున్ నిను బుధప్రకరమ్ము భజించి హర్షముల్
పిండును - భట్టతిక్కనలు పెగ్గడపెద్దనసూరనాదికుల్
దండితచిత్తులాంధ్రకవితాపరమేష్ఠులు పారిజాతపుం
జెండులు పంపి నీకుఁ గయిసేఁతలుగూర్తురు - రాణ్ణరేంద్రుఁడుం
గుండలి నేలినట్టి ప్రభుకుంజరుఁ డన్యదురాసదప్రథన్
డిండిమభట్టుబింకమును డించు మహాకవిపై వరాలమేల్
గిండులు క్రుమ్మరించు నృపకేసరి పేమనరేంద్రుఁ డంధ్రభో
జుండు సిరంగరాయలు యశోనిలయుల్ రఘునాథరాణ్ముఖుల్
తీండ్రదలుతక్కి శాంతిజలధి న్మునుకల్ పచరింతు - నానుడుల్
కొండికపల్కులంచనక కోత్తలసేయఁగదయ్య - కీరుతుల్
పండునునీకు - "మీాకవనపాండితిఁజూపి నితాంతసమ్మదం
బిం' దని కూర్మిపేర్మివెలయించి మహీపతు లెందఱెందఱో
గండెలవంటికాఁపు లధికారులు కోరుచునున్న నేదియో
మొండితనమ్ముఁదెల్పి పదమున్గదలింపనియట్టి నేను నీ

♦ చిఱుమామిళ్ల

రెండవపిల్పుతో ననువరించినకోరిక లం ధశారదా
గండసద్దురశుభ్రజలఖండవిరోధులు నీకతమ్మునం
బండునటంచు నెంచి పొగబండులరాయిడిన్ సైచి రోగముల్
పొండని ధర్మకృతుల్ పలికి పూనినకర్జములాఁపి యెట్టెటో
యొండకువానకోర్చి ధరణీశ్వర! వచ్చితి - మాతృసేవ నీ
గండు వెలార్చి నాదుకుతుకంబునుదీర్పవె - తెల్గువాణికీ
పాండువడంగునట్లు నడుపంగదె యార్ధ రసాయనంబు - పె
క్కండ్రదు మహామహుల్ పడిన కష్టముపంటగ నేఁడొ రేపొ రా
నుండిన తెల్గురాష్ట్రము శుభోత్తరమై విలసిల్లుపొంటెఁ ద
చ్ఛండతరప్రతాపము దిశావలయమ్మును దాఁటుపొంటె వే
ధోండము దాని సభ్యతకు నారతులిచ్చి భజించుపొంటెఁ బా
షండమతప్రచారములుసగ్గి జగద్ధితమబ్బుపొంటె నాం
ధ్రుండు విశిష్టధర్మబలధూర్వహుఁ డైనడినిల్చుపొంటె నె
న్నండొ తొలంగిచన విలసనంబులు శారదకబ్బుపొంటె నే
తండును వేల్తుసూపనివిధంబున దిద్దవె రాష్ట్రవాణి - నీ
గండముఁదూల్చి బాసకు వికాసమొసంగు వలంతివీవ - యె
వ్వండిది కాదటంచు నిలువంగలఁ - డట్లగుటన్ సుధీకవుల్
దండకపద్యగద్యసముదాయములం బొగడం గడానిపూ
దండలునింపి వాణినిఁకఁ దన్పవె ముక్తిపురీమహీశ్వరా!

౨౩-౧౨-౪౪

# కూట వేదాంతులు

పరసతీలావణ్యపరిపాకమును మెచ్చి
　　గుఱ్ఱిక్కిళ్ళుచుఱ్ఱఁగెడు కొంటెగుంట
ధనదాసుఁడై నిరర్థకధర్మసూత్రముల్
　　పడఁగూయుచుండు ముఱ్ఱిక్కడిగులాము
తత్త్వంబు లౌకికవిత్త్వంబు నెఱుఁగక
　　విఱ్ఱవీఁగెడి వెఱ్ఱివిధవకొడుకు
జాత్యహంకారంబు సడలింపలేక మి
　　ఱ్ఱెక్కి రజ్జులువల్కు నేబెరాశి
ఇచ్చవచ్చినచందాన నెచ్చపెట్టి
రొంపిలోఁ జిక్కి లోకులకొంప ముంచి
సతికి నోర్చినయట్టి లుచ్ఛాలుకూడ
గురువులైనారు నేఁడు మేల్కొనుఁడు జనులు

తిరుమంత్రములు సెప్ప దొరతన మొక్క జం
　　దెంపువానిదియంచు నిక్క నొకఁడు
కామి గాకయె మోక్షకామిగాఁ డంచు దు
　　రోబ్ధనల్ పచరింపఁబూను నొకఁడు
ఇది దేహధర్మంబ యిందుఁ దప్పే మంచు
　　నీచవృత్తులకుఁ బ్రేరేచు నొకఁడు

హృత్తాపహరణ మింతేని సల్పఁగ లేక
విత్తాపహరణంబ వెదకు నొకఁడు

ఇట్టి నీచులపాదాలు పట్టువార
లెట్లు కామాదిశత్రుల నదిరించి తమను
నెట్టి నిక్కంపు టెఱుకఁ జేపట్టి చావు
పుట్టుకలులేని లోకంబు మెట్టఁగలరు

గ్రాసవాసో దైన్యగతి కాఱుఁ గాలంబు
దాసులై నట్టి పెద్దమ్మ లొకట
విద్యావివేకసంపద్యోగదూరులై
బాహువుల్ సఱచెడి పశువు లొకట
మందు మాఁకులు లేక మరణశయ్యలఁ జిక్కి
పరితపించుచు నున్న పక్షులొకట
"నా" యన్న దిక్కుగానక నిస్సహాయులై
చింతలన్ జివికెడి జీబు లొకట

కలరు మన మెందుఁ జూచిన న్గలరు వీరి
సేవఁ జేయక మోక్షంబు నెందె నెవ్వఁ
డాఱుమూఁడంచు మూఁడు నాల్గనుచు వెఱ్ఱి
తత్త్వములు పాడినంత సార్థకత లేదు

౧-౧౧-౩౫

# భజ గోవిందమ్

గోవింద ప్రభు సంతత
సేవావ్రత మూను మితరచింతన మేలా
వైవస్వతుఁ డెత్తినతఱిఁ
గావదురా శబ్దశాస్త్రకౌశల మజ్ఞా!

విత్తము సేకరింపవలె వేలకువే లనుకోర్కె మాని నీ
చిత్తమునన్ దురాశలను జేర్పక సాంవివేక మూని నీ
వృత్తముచే వశంపడినవిత్తము కాసయినన్ సహస్రముం
చత్తిన వేడ్కె నెంచుకొనుమా వినుమా యనుమానమేటికిన్

పొలఁతుకగబ్బిగుబ్బలను బొక్కిళిఁ గన్గొని మోహవార్ధిలోఁ
పడఁబోకు దుర్గతికిఁ బాల్పడఁబోక వి చీమునెత్తుఱుల్
గలిగినకండలంచుఁ బొడఁగాంచినవేళల మాటిమాటికిన్
దలఁపుము పైమెఱుంగులకు దాసుఁడవై చెడిపోకు మజ్ఞుఁడా!

నలినీపత్రముమీఁది వారికణము ప్రాణంబౌట కన్గొక మ
ర్త్యులు తృష్ణామయపీడితాత్ములగుచున్ దుఃఖాబ్ధినిర్మగ్నులై
తెలివింగోల్పడి దారిగానక కడున్ దేహాభిమానమ్ముతో
నిల వర్తింతురు గాని సౌఖ్యపడువా రెవ్వార లీఱొంపిలోన్

వేలకువేలు మానవుఁడు విత్తము నార్జనచేయువేళలం
దాలును బిడ్డలున్ హితులు నందఱు నాతని గారవింతు రా
యాలును బిడ్డలున్ హితులె యర్థము గూర్పఁగలేక వృద్ధుఁడై
కాలముపుచ్చువానిఁ బొడఁగాంచరు పిల్చినఁబల్కరొక్కరున్

బొందిని బ్రాణవాయువులు పోవక నిల్చెడునంతదాఁక ని
న్నందఱుఁ గూర్మిమైఁ గుశలమా తమ కంచును బల్కరింతు రో
మందుఁడ నీవు చావఁగనె మక్కువనించిన పెండ్లమైన ని
కందినమేను చూచుటకుఁ గాతరతన్ గుఱుచున్ విరక్తయై

కాసొక వేయిగాఁ దలఁచి కల్లలు పొల్లులు కూసి సొమ్ము పే
రాస గడింపనేల నిను మర్త్య మనర్థమపో సుఖం బిఁకన్
వీసము కానరాదుసుమి విత్తము కలినయట్టివారి కౌ
రా సుతుఁడైన సంతతభయప్రదుఁడై కనిపించెడిన్ గదా

చెడుగుడులాడఁ బాడఁగను జిన్నతనంబున నాసచేయు లేఁ
బడఁతులతోడఁ గూడ నెలప్రాయమునం దభిలాషపెంచు వృ
ద్ధుఁ డయినపిమ్మటన్ విషయదుఃఖములన్ గృశియించు నింక నె
న్నఁడు మనుజుండు తత్త్వగమనం బొనరించి తరించు నక్కటా!

ఎక్కడి దీలతాంగి సుతుఁ డెవ్వఁడు వీరికి నీకు నెవ్విధిన్
జిక్కెను బాంధవం బతివిచిత్రము యీతగులాట మిందు నీ
వెక్కడినుండి యూడిపడి తెవ్వనివాఁడవు దీనితత్త్వమున్
జక్క నెఱుంగవయ్య సదసత్పరిశోధకబుద్ధియేర్పడన్

సంగత్యాగము కల్గు సజ్జనులతో సాంగత్యమున్ జేయ ని
స్సంగత్వంబునఁ జేసి మోహము వినాశంబందు నిర్మోహతన్
భంగంబున్ గనఁబోనితత్త్వ మది సంప్రాప్తించు నద్దానిచే
వంగై కోలొనరింతు రుత్తములు జీవన్ముక్తిసాహిత్యమున్

కాయపటుత్వమెల్లఁ జెడఁ గామవికార మదెట్టులుండుఁ బా
నీయము వట్టిపోవుతఱిని జెఱువన్న దిఁకేడనుండు నా
దాయ మడంగ భృత్యసముదాయము నిల్చునె తత్త్వ మబ్బుచోఁ
బాయక యున్నె సంసరణబంధము లాపదనీకబీజముల్

భోగము భాగ్యమున్ సతులు పుత్త్రులు పాత్రియము నిత్యమంచునీ
స్థిగతి మోసపోకు మివియెల్ల క్షణికమ్ము యటంచు వీనిపై
రాగము మాని విశ్వపరిరక్షకు నక్షయసౌఖ్యదాయకున్
బాగుగ నమ్మి తత్పథము పట్టు మసారవిచార మేటికిన్

శిశిరవసంతముల్ మొద లశేషఋతుల్ మఱి సందెవేకువల్
నిశలు పవళ్ళు పర్వలిడ నీబ్రదుకంతయుఁ జెల్లెఁ గాని యో
కృశమతి ! నిన్నుఁ గ్రమ్ముకొని క్రిందికి మీఁదికి లాగునేమి నీ
వశమున కింత లోఁబడక వాంఛలు దుస్సహధాటి నేఁటికిన్

వనితాకాంచనచింత నిచ్చలు నిషేవ్యంబాయె సాకార ! దీ
నిని మానందగు నంచు నింతదనుకన్ నీకెవ్వరుం జెప్పరో
ఘనసంసారసముద్రవీచిఁ గడవంగన్ లోకముల్ మూఁట స
జ్జనసాంగత్య మొకండె నావ యగుచున్ సాయంబు సేయుంజుమీ

కావిమెఱుఁగు వేసములు కట్టి జటాలురు బోడు లెందఱో
తామ్రవలయంబునం గలరు కాని గిరుల్ పరమాణుమూర్తులున్
దావులుగా వెలుంగుపరతత్త్వముఁ గాంచిరె పొట్టకూటికై
యీవిధి దంభవేషముల నెత్తెడిశుంఠలు దాని కర్హులా

ముడుతలువాఱె మేను శిరముల్ నెరసెన్ బదునాఱుదంతముల్
విడివడిపోవఁగా మొగము వెల్లిపడెన్ శతవృద్ధుఁడౌటచే
నడుగిడలేక దండ మొకఁడానఁ గరమ్మున నూఁతకోలగా
విడువఁడు తృష్ణ నిప్పటికి వెంగలిమానిసి నేమిసెప్పెదన్

అనయము వేల్పు నాతఁడు హుతాశనుఁ జండమయూఖతాపరా
శిని బవలెల్లఁ గ్రాఁగును నిశీథమునం జుబుకంబు జానులం
దునిచియు నిద్రపోవుఁ గరయుగ్మమునం దిను భిక్ష చెట్టునీ
డను వసియించు నిట్లయి విడం డొకతృష్ణనుమాత్ర మేఁగాకో

గంగాసాగరయాత్రలన్ సలిపినన్ గాంగేయదానంబు లు
ప్పొంగన్ సజ్జనకోటి కిచ్చిన వ్రతంబుల్ పెక్కు సాగించినన్
సాంగోపాంగముగా శ్రుతిస్మృతులయభ్యాసంబు నార్జించినన్
సంగుం డేగతి నందుకోఁగలఁడు మోక్షశ్రీకటాక్షంబులన్

గుడులను జెట్లనీడలను గూడుచు నేలను బవ్వళించుచున్
దడసరితోలు గట్టి వనితాధనదాసతురంగలబ్ధికై
బడలుటలేక భోగములపై మదినిల్ప కెవండు తత్త్వమే
ర్పడఁ బరికించు వానికి విరాగ మొసంగుసుఖం బలంతియే

యోగసమాశ్రితుం డయిన నుత్తమభోగనిధానుఁ డైనఁ దా
రాగవిహీనుఁ డైన ఘనరాగపరీవృతుఁ డైన నిత్య మ
య్యాగమవేద్యు సర్వజగదాద్యు ననంతు నకల్మషున్ బరున్
బాగుగఁ జిత్తమం దిడిన బ్రహ్మపదంబును జేరకుండునే

గీతలలోపలన్ వెలయుకీలు నెఱింగినవాఁడు స్వర్ధునీ
పూతజలంబు త్రావినసుపుణ్యుఁడు కేశవనామకీర్తన
ప్రీతుఁడు ప్రేతనాయకుని భీషణముద్గరముం దలంచి లో
భీతిలనేల దండధరుబింకము సాగునె వానిముంగడన్

పలుమఱు జన్మమెత్తుటయుఁ బల్మఱుచచ్చుట మాతృకుక్షిలోఁ
పలఁ బలుమాఱుసొచ్చుటయుఁ బాపపుసంసృతిచే నగుం గదా
తెలియుము కర్మబంధములఁ ద్రెంచి సుఖించుపథంబు; దీనికై
వలసినమేలివెల్గు సిరివల్లభుసేవయుపో త్రిశుద్ధిగన్

యోగనిబద్ధచిత్తుఁడగు యోగివరేణ్యుఁడు సందుగొందులన్
మూఁగినరిత్తపీలికల బొంతలుగట్టుచుఁ బుణ్యదుష్కృత
త్యాగమొనర్చి బాలునిషిధంబునఁ జిత్తవికారికైవడిన్
వీఁగనివేడ్కలో మునుకవేయుచు నిర్మముఁడై రమించెడిన్

ఎవ్వఁడవీవు నేనెవఁడ నిచ్చటి కెచ్చటినుండిరాక యీ
యవ్వయు నయ్యు యెవ్వ రనినప్పుడు సంసృతి స్వప్నతుల్యమై
నివ్వెఱఁగున్ ఘటించుటది నిక్కము కానఁ దదీయబంధముల్
త్రెవ్వఁగనేసి యున్మిషితధీనిలయుండవు గమ్ము తమ్ముఁడా!

అందఱిలోపలన్ వెలయునట్టిమహాత్ముఁడు విష్ణువొండ యీ
చందమెఱింగి భేదములఁజంపుము భూతదయామయుండవై
పొందుము మోక్షసౌఖ్యములఁ బుట్టుట గిట్టుట కట్టిపెట్టు మో
మందుఁడ నీవు నే ననెడుమచ్చర మేటికి మాటిమాటికిన్

లోపలిశత్రుషట్కమును లోఁచినవాఁ డపరోక్షబుద్ధికిన్
ప్రాపయి తన్నుఁ దా నెఱుఁగు బ్రహ్మముఁగా నవికారమూర్తిఁగా
నేపను వాత్మతత్త్వ మది యించుకయే నెఱుగం డతం డిసీ
పాపగృహంబు సంసృతికిఁ బాల్పడి నారకవహ్ని మ్రగ్గడిన్

గీతానామసహస్రమున్ నిరతమున్ గీర్తింపుమా శ్రీపతిన్
జేతోవీథి నఖండభక్తి వెలయన్ సేవింపుమా సజ్జన
వ్రాతస్నేహ మొనర్చి పూతమతివై వర్ధిల్లుమా విత్తపుం
బాఁతుల్ త్రివ్వి దయానికేతనుఁడవై పాలింపుమా పేదలన్

౩౦–౫–౨౩

# సేవాధర్మము

[కాళిదాసు ననుసరించి]

దిలీపుఁడు వసిష్ఠుం జేరి తన యనపత్యతకు వగవ, నా ఋషీంద్రుఁ డతని నోదార్చి "నా హోమధేనువును నందినిని బూజింపు-మఱియు నీ యీప్సితంబు నొసంగు"-ననవృషు మహీపాలుఁ డా మొదవును భక్తిమై సేవింపఁజాగె-నొక్కనాఁ డా గిడ్డి నడవికిఁ దోలుకొనిపోయిన—

మనుజవిభుండు దుష్టమృగమండలి కాఁబసిసేడ నేనియుం
జెనకుట దుశ్శకంబనుచుఁ జిత్తమునం దలపోసి చెంగటం
దనరు మహీధ్రమాళి సముదంచితశోభలు కాంచువేళ నే
పునఁ జనుదెంచి పైదుమికి బోరనసీడ్చె మృగేంద్ర మగ్గవిన్

గుహలు మాఱుసెలఁగ గోవప్పు డఱచిన
యార్పు దీనబంధువగు నృపాలు
శైలసక్తదృష్టి సరగమరల్చెఁ బ
గ్గాలఁబట్టి యీడ్చుకరణి తోఁప

ధాతుమయమైన కొండనెత్తమ్మునందుఁ
బూదియేచిన లొద్దుగుపోల్కి నెఱ్ఱఁ
దనము నెగఁజిమ్ము కుత్తిపైఁ దాండవించు
తెల్లమొకమునుగాంచె న విల్లుదాల్పు

అంత మృగేంద్రగామియు జితారియు నార్తశరణ్యుఁడైన భూ
కాంతుఁడు స్వప్రమాదమునఁ గల్గినచెట్టకు సిగ్గుచెంది దు
స్స్వాంతము వధ్యమైన మృగవల్లభముం దెగటార్పఁగా నిషం
గాంతర శస్త్రముఁ దివియ నాసపడె న్గడు నల్కతోల్కఁగన్

చిత్తరువునందు దిద్దితీర్చిన విధానఁ
గదలదయ్యె నవ్వీరునికరము నఖర
కాంతినికరపరిచ్ఛన్న కంకపత్రి
శరశిరోబాంధవత్యాగసహముగాక

తన కరంబట్లు మ్రోఁకువాఱిన వివృద్ధ
రోషుఁడా రాజు మాంత్రికరుద్ధవీర్య
భోగివై చెంతఁగల మార్తుఁ బోమువలేని
తన ప్రతాపమ్ముచే లోనఁ దగులఁబడియె

తనయునిక్కకి వెఱఁగందెడు
మనుకులమణి సింహసత్త్వ మాన్యుని గని యి
ట్లనెఁ గేసరి నరభాషల
జనపాలుఁ డవేలచిత్రచకితుఁడు గాఁగన్

ఏల వృథాశ్రమించెదు నరేశ్వర! నీ విశిఖంబు వచ్చియున్
జాలదు నన్నుఁ గూల్ప నిది సత్యము యంబరచుంబిపాద పో
న్మూలన కౌశలమ్మునకు నోఁచిన మారుతుఁ డెంత నిక్కనన్
శైలమునూఁపునా విమతసార మెఱుంగక విక్రమింతువా

శివుఁడు రజతాచలంబు నాఁ జెలఁగు నాము
ఔద్దు నెక్కుచుఁ బాదంబు నింతమోపి
దయఁ బవిత్రమొనర్చు నీ దాసునడుము
నధిప! నన్నుఁ గుంభోదరుఁ డండ్రు జనులు

శివుఁడు ముద్దుసేయు చిన్నారిపాప యీ
దేవదారు; వభవుదేవి దీనిఁ
బెసిచె మేల్మి పసిఁడి బిందెలతోడఁ దె
చ్చినపయస్సువోసి చిన్ననాఁడు

చెక్కిటి తీఁట నడంపఁగ
నొక్క వనేభంబు రుద్దె నొకపరి దీనిన్
రక్కసిములుకులఁ జిక్కిన
యక్కొమరుం గూర్చిపోలె నపు డుమ వగచెన్

అదిమొద లోన్నృపాల! వనహస్తి భయంపడ నన్ను సింగపుం
గొదమను జేసి యాతుహీన గోత్రి గుహాగృహావాస మిచ్చి నన్
గదిసెడి సత్త్వకోటి నెరగా నియమించెఁ బినాకపాణి యు
మ్మదలఁ దలన్ ధరించి సతము న్నెఱవేర్తు మదీయధర్మమున్

శంభు నిర్దిష్ట భోజనసమయమగుచు
నాకుఁ జిక్కిన యీ కుఱ్ఱెసల్లఁ జేసి
క్షుధితుఁడగు రాహు వైందవసుధనుబోలెఁ
దనివిసెందెద నేఁడు గోత్రాకళత్ర!

శస్త్రసాధ్యంబుగాని రక్ష్యమును విడువఁ
దలఁగిపోవునాకో ధనుర్ధరుల కీర్తి
యోపిఁకొలంది గురుభక్తి చూపినట్టి
నీకు సిగ్గేల యిఁకఁబొమ్మ నెలవు సేర

మృగరాజిట్లు వచించిన
ప్రగల్భవాక్యములు విని నృపాలుండు నిజా
శుగ మిట్లడఁగుట శివుచే
తఁ గదాయని విడిచె నాత్మఁదగిలిన రీఢన్

అతఁడు బాణప్రయోగభగ్నాదిమప్ర
యత్నుఁడై కులిశంబునేయం గడంగి
నాఁడు ముక్కంటిచూపుచే మోఁడువాఱు
నిందుబ్రబలె నిల్చి కేసరి నిట్లుపలికె

సింగమ ! విను మిబ్భంగిని
భంగంపడినట్టి యేను బల్కెడినుడి న
వ్వంగఁ దగినదియ; యైనఁ బ
రేఁగిత మీ వెఱుఁగుదానవే యని వినుతుల్

జగములెల్ల నేలు చంద్రమశ్చూడుఁడో
యన్న! నాకుఁ బూజ్యుఁడగును గాని
యాహితాగ్ని గురుని యా విట్లుత్రుంగుచు
నెదుటనుంటసూచి యెట్లు సైఁతు

అట్లగుట నీవు నా దేహ మారగించి
యాఁకటిం బాపికొమ్ము; నాయుఁతనమున
కమ్మ్రకొఱకు నంబాయని యఱచు లేఁగఁ
దలఁచి వీడుము ఋషికులోత్తముఃసురభి

ఒడయుని యాఁశల్కాలు విని
పడఁకులచీకటులు తొలఁగఁబాఱ నన్నగి యు
వ్వోడఁద మొగంపు మెకం బీ
వడువున వాకుచ్చె నవనివల్లభుతోడన్

ఎదురుగొడుగు లేని యేలికతనమును
గ్రొత్త జవ్వనంబు గొనబుమేని
నల్పమైన లాభ మాసించి విడిచెద
వెంత మూఢబుద్ధి వీవు నృపతి!

భూతదయ నీకుఁ గలదేని జేతమందు
నరయు మాపల్కు; నీవు మైఁ దొరఁగ నొక్క
మొదవె జీవించు నటుగాక బ్రదుకుదేని
జనకువలె నెల్లప్రాణుల సాఁకనోర్తు

గురుఁడు శిఖితుల్యుఁ డతని కొక్కొండె మొదవు
దాని విడిచిన నతనిశాపానఁ బడుదు
నంచు వెఱచెదె తద్రోషమార్పఁబొంటె
నీకు మందలు లేవె దుగ్ధాకరములు

అట్లగుట నెల్లశుభముల ననుభవించు
నీ బలిష్ఠశరీరంబు నిలిపికొమ్ము
మనుజనాథ! భూస్పర్శనమాత్రభిన్న
శాతమన్యవపదము రాజ్యం బనంగ

సింగ మిటుపల్కి విరమింప శీతగిరియు
జనవరేణ్యున కట్ల యుచ్చైస్స్వనమునఁ
జెప్పెనో యనఁ గందరాసీమవలన
మూంరిఁబోవుచు వెల్వడె మాఱుమ్రోఁత

శివకింకరుఁ డిట్లన మా
నవనాథుఁడు భీతలోచనమ్ములతోఁ ద
న్నవలోకించెడి గురుధే
నువుపైఁ గడు జాలి నొంది నుడివె స్మగుడర్

క్షత్రపదమ్ము గదా మద్
గోత్రమ్మునపేరు; దీని గుట్టెఱిఁగియున్నా
వీ త్రోవ నుండ విడిచి ధ
రిత్రి రాజ్యంబు నెటు వరింతు మృగేంద్రా!

లాఁతి మొదవుల నొసఁగి యేరీతిఁ దబిసి
మంట చల్లార్తు నిది వేల్పుదంటగిడ్డి
కంటె వెల్తిదిగాదు ముక్కంటికరుణ
యుంట నీ తోడుకుం బట్టుకొంటి వీవు

నా యొడలి న్వేలగా నిడి
యీ యావుం బ్రోచుటొప్పు నిటు లొనరింపన్
నీ యశనార్తిచను న్మని
రాయని హోమాదివిధుల రాయిడి తొలఁగున్

రక్ష్యమును మిత్తికిడి శరీరంబు గాయ
పడని సేవకుఁ డెటు నిల్చుఁ బ్రభువు నెదుట
నీవు నొకయయ్యకడఁ గొల్వు నెఱపవోటు
లేదె నీకును నా కావులీల మ్రాఁకు

ఏ నవధ్యుఁడ నని యెంతువేని మద్య
శోంగరక్షణ సేయు మీ యంగ మంది
బుద్బుదప్రాయమును బంచభూతమయము
నైన మేనిపై మనుబోఁటు లాసపడరు

మాటలాడికొంట మైత్రికి మూల మా
మైత్రి పాదుకొనియె మనకు నిచటఁ
గాన మిత్రుకోరికను జిన్నపుచ్చుట
నీకుఁ దగదు భూతనేతృదాస !

అనుడు నుప్పొంగి విడిచె సింహంబు కుత్తి
నపుడ నృపబాహునిర్బంధ మడఁగె-నంత
ముక్తశస్త్రుఁడు నిజదేహమును మృగేంద్ర
మున కొసఁగె రాజు మాంసంపుముద్దఁబోలె

అపు డధోముఖుఁడై నరేంద్రాగ్రసరుఁడు
ఘోరసింహనిపాతమ్ముకొఱకు నెదురు
సూచుచుండఁగ నతనిపై నేచి కురిసె
నమరహస్త విముక్త లతాంత వృష్టి

అంత లేవఁగదోయివత్సా యటంచు
నమృతమయి వాణి చెవిసోఁక నవనిభర్త
లేచి పాల్చేపి తన తల్లిలీల నున్న
సురభిఁ గనె మ్రోల సింగంబు సురిఁగిపోయె

ఎంతయు నబ్బురంపడు నరేంద్రున కిట్టులు పల్కె గోవు నీ
స్వాంత మెఱుంగ సాధుజనసత్తమ! సింగము నైతి నేన న
న్నంతకుఁడేని డాయ భయమందు ఋషీంద్రుని శక్తి నేన నిం
కెంత తదన్యఘాతుకము; లించుక నీవ తలంచి చూడుమా

నీ దయకును గురుభక్తికి
నాదగు హృది పల్లవించినది దుగ్ధంబే
కా దెట్టి కోర్కెనేనియు
నీఁదగుదుఁ బ్రసన్ననైన నేను గుమారా!

పదపడి మానితార్థి నిజబాహుసమార్జిత వీరశబ్దుఁడై
పొదలిన యక్ష్మాభుండు కరము ల్ముకుళించి కులాభివర్ధనుం
సదమల నిత్యకీర్తి విలసచ్చరితుం సుతు నిమ్మటంచు న
మ్మొదవును వేఁడె నేఁడు వ్రతముల్ ఫలియించెనటంచునుబ్బుచున్

మెచ్చితిఁ గుమార ! నీ వర
మిచ్చితి నని పల్కి ధేను విడెఁ ద్రావుము నా
వెచ్చని పాలని మేలని
సచ్చాతున కానతిచ్చె జనపాలునకున్

౪-౧౨-౩౦

# అవివేకము

నుడువక మాను లెట్టులు తెనుంగున పుస్తక మచ్చుకూటపుం
గడపను దాఁటుచుండఁగనె కట్టలు కట్టలు ముట్టిజాబు లీ
యడిగెడువారు గ్రంథనిలయంబుల నేలెడుసార్వభౌము లీ
చెడుపని మెచ్చుకున్న వికసింపదఁటే మనబాస లేశమున్

ఒక్కవివేకమే తఱిఁగియున్నది గాని తెలుంగువానిలో
జిక్కదు లౌభ్య మాఁపథము సేయుటకున్; సిగరెట్టుముక్కకే
చెక్కులుమార్చు నాఁటఁ, డోఁకచిన్నయెలెక్షనుకాండలో సివం
బెక్కిన వేలువేలు బలియిచ్చును బుచ్చినవక్కలట్టులన్

కవులఁ గలంచుమార్గ మది కాదు తదీయకటాక్షసంపదల్
లవమును లేనినాఁడు శుభలక్షణముల్ పదిలక్ష లుండుఁ గా
కెవఁడు గడించుఁ గీర్తి గడియించెనపో మఖఁ బుట్టి పుబ్బలో
సవచెడి పోవుఁగాని మనఁజాలునె తా నమరత్వ మేర్పడన్

౨౮-౯-౩౮

# కృతమెఱుక

ఏఁడాదినాఁటి కథ యిది
నాఁడు పురాపాపఫల మనం దగురుజ కే
నోడి పరిణామశూలకు
గోడు గుడుచుచుంటి నెదురుకొనుచుంటి విధిన్

ఏడేండ్లు నన్ను నలిపిన
గాడిద యిది సమసిపోయెఁగా యనుకొంచున్
మూఁడేం డ్లీడ్బ్రితి బుగిలిన
మ్రోడే చివురించి నేఁడు మొగ్గలుతొడిగెన్

గుఱితప్పనిపోట్లు తెరల్
తెరలుగ నెసరేఁగు నొప్పి తీవ్రతరంబై
నెఱఁకులు చూడెడిమంటయు
హరిహరి! యీనరక మొల్ల నసుహృత్తునకున్

సంధివాతపీడ సరిపోవ దని ఘోర
మూలరోగబాధ చాల దంచు
నిది ప్రయుక్తమయ్యె విధి యింత కఱకరి
వృత్తి నెట్లు వలచె వ్రీడలేక

ఆ మందని యీ మందని
యేమందుఁ జికిత్స లప్పు డెన్నో నడిచెన్
హేమంబు వినా జారర
మామయ మడఁగారదయ్యె నావంతేనిన్

వ్యాధులకు వానితాతల
కాధులకుం జిక్కి యిర్వదాతేండ్ల మహా
బాధలు గుడిచితి నిన్నీ
మాధుర్యాలవమ్ము లేని మనుగడ గంటిన్

దేశంబులు తిరిగితినా
యాశంసితమైన భుక్తి నాపోయితినా
దేశికులం గొల్చి కవితా
కౌశల్యము గంటినా సుఖం బంటితినా

చెలిమికాండ్రు - చుట్టముల - పెండ్లి వేడ్కల
ననుభవింపఁ గంటినా జగమ్ము
పెద్దపీఁటవైవఁ బిలిచినరచ్చల
కరిగి కరఁగినాఁడనా పొగడ్త

ఈ పాటుపోట్ల కగపడి
నా పొందని చెట్టలుండునా జనిరాశిన్
బాపగ్రహమ్ము కేతువు
కాఁపుర మొనరింప నాదుగతి వేఱగునా

అవిరతచింతావహ ననుఁ
గవితాలలితాంగి వలచి కరుణింపనిచో
భవ మిది మఱెంత వ్రేఁగై
నవతాలేశమ్ము లేక నవయించెడిదో

ప్రాఁబడినపున్నె ముంటనో పరమధర్మ
మూర్తి నాతండ్రి యాటనో మూరిఁబోవు
కలిమి నేలెడువారి క్రేగన్ను వలచు
కర్కసము లేమియున్ నన్నుఁ గాచె నింత

ప్రకృతమ్మున కిఁక వచ్చెద
నొక మిత్త్రుఁడు నా లిఖించు నుత్తరమున నూ
మక మీ కైవ్యుఃఖం గనుఁగొని
వికలాత్ముఁ డవార్యహార్ద్రపేల్లితుఁ డగుచున్

"ఏలా భేషజ మలమట
పాలై రేలుం బవళ్లు పనవుట మేలా
హేలగదా గోదుమ కీ
శూలాహంకార మూఱఁజూచుట యున్నన్

క్షారామ్లము లుడుఁగుము గో
క్షీరంబులు క్రోలు మిదియె సిద్ధౌషధమై
నీ రుగ్భరమ్ము డించు న
పార మనామయము నగ్గపఱుచుచున్ నీకున్"

అనుచుఁ గమ్మనంప నాతఁ డాయుర్వేద
వేత్త యగుట వాని యుత్తరంబు
నాదరించి నాఁడె గోదుమ లార్జింపఁ
గడఁగి పాట్టమెల్ల నడిగినాఁడ

ధరణీఖండము లన్నిట
విరిసి విలయతాండవంబు వెలయించెను దు
ర్భర సంగ్రామము దెచ్చిన
కఱవున సుమనమ్ము లేద క్రయ్యం బచటన్

కర్తవ్య మేమి యిఁక నీ
యార్తిం దరియించు టెట్టు లని యెంచునెడన్
♦ మూర్తిపురి నది ఫలించిన
వార్తన్ హితుఁ డొకండు వినిచె నటం బోలఁచెన్

పిలిచి పంపవయ్యా వెలకేమి గోదుమల్
కాకుమానిలోనఁ గలవఁ టంచు
నప్పికట్ల నున్నయనుఁగు కుఱ్ఱాసుబ్బ
రాయకవికి లేఖ వ్రాసినాఁడ

♦ నా యునికి నుండి యచటికిఁ
బోయెడు మోటారు నెక్కి పోవు పథికుచే
నీ యుత్తర మిడ ఘట్టము
డాయం జని కొంతతడ వట న్నిలఁబడితిన్

అంత గునగున గర్తపుర్యాశనుండి
చిన్నకారొండు వచ్చి నా యున్నచోట
నాఁగె నది * మృగయాపల్లి కేగు టెఱిఁగి
కమ్మ నిచ్చితి నందున్న కర్షకునకు

♦ భట్టుమూర్తి ♦ అప్పటి నాయునికి నిడుదప్రోలు * వేటపాలెము

మఱవకు బాబూ ! మీ చను
తెరువునఁ గల దప్పికట్ల దీని నచట నె
వ్వారి కిచ్చినఁ జాలు నమ
స్కారణం బని సేరికొంటి సదనంబునకున్

ముట్టు నిపుడ లేఖ వెట్టీని దోలి మా
మఱఁది యెల్లి గోదుమలను జేర్చు
రొట్టెముక్కతోడ నెట్టెద శూలమ్ము
నంచు మివ్వుల నుఱవణించుచుంటి

ఆసమెయిన్ మఱుసటి నాఁ
డాసాయము కాచుచుంటి నా సాయముకై
నా సంకటపా టెంతల
కోసరునా యంచు సెజ్జ నొదిఁగిలఁబడితిన్

మెలివేయు కడుపునొప్పికి
విల విల పోవుచుఁ గసాయివిధి దూఱుచు బి
డ్డలఁ జూచి వెచ్చనూర్పుచు
నలందురుచు నుండ నక్త మర్ధము కడచెన్

తలవాకిట నపు డెవరో
నిలిచి ననుం బిలుచునట్టి నినదము వెడలెన్
మెలమెల్లన పర్యంకము
వలనన్ డిగి వచ్చి యెవరువా రని యంటిన్

తిల్లికనుబెంచి వాకిలి తెఱచి నిలిచి
లేఁతజాబిల్లి జిగిఁ బుక్కిలించి యుమియు
కదరువల్వల కొకవింతకాంతి నొసఁగు
నగుమొగమువానిఁ గంటి నన్గదియువాని

ఇతఁ డెవ్వఁడు ననుఁ బిల్వం
గతమేమి యంచు నైకగతులన్ జనితిన్ ;
నతులు కవీంద్రుల కని విన
మిత్రుఁడై యతఁ డిట్లు పల్కె మృదువాక్సరణిన్

చౌదరిగారూ ! తమ కా
పాదించితి నోవి నిద్రపట్టినవేళన్
నాదెస మన్నన చూపుఁడు
మీ దర్శన మాట నధిగమించితి ముదమున్

మీ బాధ యెట్టు లున్నది
బాబూ ! జఠరాత్రి కగ్గపడితిరె విధి మీ
కీబెడఁద గూర్చి ప్రై వడె
నాఁబోతుం జేసి మఱియు నది కట్టఱవన్

ఇవి గోదుమ లవి మిమ్మున్
నవయించెడు తెవులు నణఁచెనా రుగ్నుఁడు స
త్కవి కింత మే లొదవె నని
మివులం దనివోదు మాప్తమిత్రులతోడన్

అని చేతిమూట నా ముం
దునిచిన నత్యద్భుతం బహో! యే మిది యీ
నను మెచ్చు గఱువచరితం
బనఁ గీదృశ మంచు నెడఁద హాళిహాళి వడుచున్

ఏ నాతని కిటు లాడితి
మీనామం బేమి యేది మీయునికి యగున్
గ్లానుం డితఁ డేక్రియ మీ
మానసమున కంటె గోదుమ ల్గాని తేరన్

ఇంద్రజాల మాయె నీ కథ నా పాలఁ
గలయొ నిక్కువంబొ కాననైతిఁ
దెలుపుఁడయ్య నన్నుఁ గలరూపు వక్కణ
చేసి యనుడుఁ దనకు డాసి యతఁడు

అప్పికట్లకు నిన్న మీ రనుచునట్టి
కమ్మ నందినవారు మా కారువారె
దారిలో దాని విచ్చిన నేర మొండు
కలదు మాపట్ల సైరింపవలయు మీరు

* మీ కృతిని దానయాఖ్యుఁడు
స్వీకృతి గావించు నెడ రచించిన కవనం
బా కమ్మకు వెలుపల మధు
రాకృతిమై మెఱయుచున్నయది ముద్రితమై

* ధర్మజ్యోతి

ఆ పద్యంబులపైఁ గల
తీపియు మ మ్మింతదనుకఁ దెచ్చెను వానన్
మీ పొలకువ గని లేఖయు
మీ పంపిన దగు నటంచు మే మారయుచున్

మీ రచనమ్ముదెసం గల
గారవమునఁ జేసి తగవు గాకున్నను బ
ల్మా ఱది చదివితి మెఱిఁగితి
మాఱని గోరంబు మిమ్ము నలఁచుట సుకవీ!

జాతికిఁ బ్రాణము వోసిన
కైతను సృష్టించినట్టి కవితల్లజుఁ డీ
రీతిం గుములునె దైవం
బేతత్క్రియ కెట్టు లోర్చె నిసిరో యంచున్

మాసాహు సాహితీ కవి
తా సంగీత ప్రియుం డుదారాశయుఁ డాం
ధ్ర సంతత సేవావ్రతి
వాసజ్జీవితుఁడు పెద్దవనటం దగిలెన్

కవి బుధ గాయక గోష్ఠీ
భవితవ్యసమాప్తహర్ష పరవశుఁ డగుచున్
దివములు రాత్రులు రసిక
ప్రవరుం డతఁ డొక్కలిప్త పగిదిన్ గడపున్

మీా కృతులు పతివ్రత లని
మీా కవితాప్రౌఢి నిరుపమేయం బని మీా
వాకు లవి బ్రాఁకు లని మీా
పోకడ నార్జవము ననయుఁబో! యని మెచ్చన్

మెచ్చనివాఁ డెవ్వఁడు కలఁ
డచ్చపు టొయ్యారమునకు నాదరువై వె
ల్గిచ్చిన మీా కృతి-నీర్ష్యకు
మచ్చరమున కంజలించు మానిసి తక్కన్

మఱుమ్రోయు న్గద తెల్గువీణియల యుష్మద్రాష్ట్ర గానమ్ము మీా
కొరడాదెబ్బకు దద్దఱిల్లిపడి తెల్గుల్ మేలుకొన్నా రహో!
పురుషోత్తంసు కథన్ రచించితిరి మా పుణ్యాలకుం బంటఁగా
మఱవంజాలరు మీారు దేశమును ధర్మంబున్ గవిగ్రామణీ!

పరులసిరుల కాసపడి కైత కొగ్గరు
పరమ ధర్మసేవ మఱగి కాక
జగము పల్లుపులిసి సొగ సెఁబో కృతు లిచ్చు
పట్ల మీా వెలార్చు పాడి నరసి

గర్తపురి నుండు మేము సత్కీర్తి గన్న
మద్దివంశమునం బుట్టె మా వణిక్కు;
అతఁడు వేంకటసుబ్బరా వనెడు పేర
బేర మొనరించు నెల్లసర్కారులందు

నన్ను. రాజయ్య యందు ప్రాణమ్ముపోలె
నుండు నాతని సరస మిత్రుండ నగుచు
రాణ కెక్కిన మాధవరడ్డి వంశ
మన్మదీయమ్ము వలతుఁ గవ్వర్చు సతము

ఇచటు వీడి నిన్న యే మప్పికట్లలోఁ
బత్రి మిచ్చి వేఁటపాలె మేగి
వలయుపనులు సూచి వర్జినియా పోగా
కచటి తిమ్మసంద్రమందు నిలిచి

మది నొకమూాల డాఁగి మము మాటికి మాటికి హెచ్చరించు మీా
వ్యధను దలంచి గోదుమలు పండినవా యిట నంచుఁ గాఁపులం
బదుగురఁ బల్కి వాని నొకపట్టునఁ గాంచి సుమేరుపాదముం
గదిసినయట్లు హర్షణము గంటిమి కొంటిమి నేఁటిమాపటన్

ఇపుడ కొనిపోయి సుమనమ్ము నిచ్చి రమ్ము
కస్తి మున్నారు చౌదరిగా రటంచు
బచ్చుత్తేఁ డంద నిలిచి కా రిచ్చి నన్నుఁ
దఱుమ నిటు వచ్చితిం గవితాతపస్వి

కవులు మిముఁబోనివారు సంఘమున కెల్ల
సర్వాణీయులు నీలువేల్పు లగుటఁ జేసి
చంద్రునకు నూలిపో గన్న చంద మరసి
యిచ్చు నుడుగర దీని గ్రహింపరయ్య

అనుడు నివ్వెఱపడి తేఱుకొని యుదారు
లెంద ఱున్నా రకారణబంధువులు భ
వాదృశులు కవితాకళాప్రవణు లిట్టి
మీకుఁ జెల్లింతు మన్న మోవాకశతము

గాలించియు నొకరూకకు
సోలెఁడు గోదుమలు కల్మి చూడని యీ దు
ష్కాలమ్మునఁ బదిసేరులు
నాలోఁగిటఁ గ్రుమ్మరించినారా యవురా

మద్దివారికి సిరులలో నద్దిలేని
వారి కిది బ్రాఁతి గాకపోవచ్చుఁ గాని
యడుగకయ మున్న పంపినయట్టియీవి
కెంచి వెలకట్ట నోపువాఁ డెవఁడు గలఁడు

వానిజీవనమ్ము వంధ్య మా జంతువు
కలిమి రిత్త యతని తెలివి చెత్త
కస్తి నున్నవారిఁ గని విని యెవ్వాఁడు
వెన్న కన్నయై ద్రవింపకుండు

నెల యేల యల్లు వెన్నెలతీవపందిళ్ళు
రవి యేల పఱపు నాఱనివెలుంగు
పిక మేల క్రోల్చుఁ దేనెకుఁ దేనె యగుపాట
ఘనుఁ డేల చల్లు ముక్కారుజల్లు

విరి యేల పంచు మైమఱపించు నెత్తావి
మ్రా నేలకాచుఁ గమ్మనిఫలంబు
కవి యేల పల్కుఁ జక్కఁదనాల కబ్బమ్ము
గా డ్పేల విసరు లోకము చివుర్పఁ

గోరువారి దెసన కురిసిరా యీ మేలు
పెఱల నేమి కొంచెపఱచినారె
సాధుశీలురకు నిసర్గ మభ్యర్థివృత్తుల్
గాకమున్న తనివి కలుగఁజేత

ఈ ఋణము నీఁగరానిది
మీ రమణీయాశయమ్ము మీఁగడకంటెన్
దేఱిన కీర్తిస్ఫూర్తికిఁ
గారణమై సభల మెప్పుగనునట్టి దగున్

ఏ కవనమ్మున మీగలు
నాకవన మ్మగుచు నిట్లు ననుఁ దన్పితి రా
నాకవనం బిది కూర్మిం
జేకొనుఁడీ నెనరుపాలిచిన్నెగ నిత్తున్

అని వచించుచు నస్మదీయమ్ము లయిన
కృతులు సుకృతికి మాధవరెడ్డివంశ
వనధిరాజున కర్పించి వినయపూర్వ
కాంజలులు మద్ది సుబ్బరాయనికిఁ బల్కు

ఇది కొసరాజువృద్ధు జగదీడ్యగుణోదయుఁ డేలు శీలసం
పద గల గుచ్ఛమా పఱిగపంట యనం దగుకావ్యమా సుధా
సదనము నీ రొసంగినప్రసాదము నీపఱిగన్ భజించి పెం
చెద నీకఁ బుట్టుపుట్లు కవిసింహా! సమున్నతభావరత్నముల్

అని వినీతుఁడు రాజయాహ్వయుఁడు శబ్ద
మాధురీ సాధురీతులు మల్లడింపఁ
బలుకరించుచు విశ్లేషభరము సైఁప
లేక సైఁచుచు వేఁటపాలెమున కరిగె

అపకారము దిగమ్రింగుట
యుపకృతి బాహిరము సేఁత యుచితం బని ధీ
నిపుణులు సెప్పుట వాణీ
కృప నీకథ కథురత్న మోయంగంటిన్

కావించుమేలు మఱచెడు
దేహాన్నప్రియుల కవమధీబద్ధుల కీ
తోవ్రవ భయప్రీడా స
ద్భావశ్రీజనక మొజ్జబంతియు నగుతెన్

జయ మొసంగుఁ గాత సర్వదా శారదా
పాద కటకనాద సాధుమాధు
రీ ఝురీ ప్రసూన సరీయో ధ్రికవితా మ
హావిధాన్స పూజ నోత్సుకులకు

౨౭–౧–౪౬



ఇతఁ డహింసారణవ్రతుఁ డితఁ డభేద్య

సత్యకవచుండు భువనైకశాంతిదూత

యుగయుగమ్ములు కల్పముల్ ముగియుఁగాక

తరణియై మింట మెఱయు నీతనిపతాక

# అమర జ్యోతి

యుగయుగమ్ముల భారతోర్వీ తపఃపుంజ
మొసరేఁగి జగముల కిడిన పంట
తరతరమ్ములనుండి తరలని దాస్యమ్ము
కట్లు త్రెంచిన శాంతికదనయోద్ధ
నరనరమ్మున జీవన జ్యోత్స్నగా నహిం
సను సహించిన యోగి సత్తముండు
పదపదమ్మున సత్యభాషా సనాతన
సౌరభ్యములు చిమ్ము సాధుశీలుఁ
డహరహమ్మును విశ్వ కల్యాణలబ్ధి
కొఱకు నాత్మార్పణ మొనర్చుకొను తపస్వి
కూలెనా దుర్మతోన్మాదకుటిలతంత్రి
జుష్ట దుషచ్ఛటా మృత్యుముష్టిహాతికి

ఒఱగెన్ విశ్వపతాకలెల్ల వసుధా వ్యోమంబు లార్తస్వర
స్ఫుర ణాకంపిత వీథులయ్యె మిహిరాంశుజ్యోతు లేపారినన్
గఱికుంజీఁకటు లేచి కప్పె దెసలన్ గాకోలకల్పమ్ములై
చరమస్థానము నీవు సేర జగమే స్తంభించె నాత్మేశ్వరా !

తల్లి యుఁదండ్రియున్ గురుఁడు దాతయు నేతయు నెయ్యతియ్యముల్
చల్లెడిమిత్రుఁడున్ సచివసత్తముఁ డుత్తమబంధు వీశ్వరుం
డెల్లరు లేని దైన్య ముదయించెఁగదా! యిటు లెన్ని కల్పముల్
చెల్లునో మాకు నచ్ఛతరజీవను లబ్బుటకున్ భవాదృశుల్

పల్లదుఁ డేచి పేల్చిన తుపాకికి నీ హృదయమ్ము వ్రయ్యలై
వెల్లువకట్టి హా స్త్రిపురవీథుల నీ రుధిరమ్ము పాఱెనా
తుళ్ళిపడి దుష్టశక్తుల నెదుర్చుట కందలి చుక్క చుక్కకున్
బల్లిదు లిద్ధవీరపరిపాలకు లెందఱు పుట్టివత్తురో

పూవుల తెప్పపైఁ గదలి పోయితివా యమునాతరంగిణీ
పావనరాజఘట్టమున భౌతికదేహము గాల్చుకొంటివా
నీ వపురస్థి చందనవనీశకలమ్ముల బూడిదయ్యెనా
బావురుమంచు నీదు చితిపజ్జల శోకము పొంగెనా ప్రభూ!

బలిసెన్ దావక భూతిమోచు యమునాభాగీరథీ గౌతమీ
బలదా సహ్యసుతా మహేంద్రతనయా భద్రా కవేరాత్మజా
సలలోర్మిచ్ఛట కీప్సితార్థసుఖముల్ సంధించు పుణ్యాంబు త
జ్జలసేకంబున భారతక్షితి నహింసాసస్యముల్ పండుతన్

మందాకినీసరిత్కా
ళిందీ భారతుల నస్థిలేశము కలియన్
హిందూ ముస్లిము క్రైస్తవ
బృందములో నీమహస్సు పెనఁగొన్నదిరా

నీబూదిన్ గొని తెచ్చ్రైలుఁ గనుచో నేత్రమ్ము లంధమ్ములై
బాబూ మూర్ఛనుఁ జిక్కినాఁడ మన యీబంధంబు నేమందువో
నా బాగోగు సమీక్ష చేసికొనుచున్ నాఁడెల్ల వేసారితిన్
నీ బంధుత్వము నాదుభాగ్య మనుకొంటిన్ భక్తినమ్రుండనై

చేసిన సేవయుఁ ద్యాగము
విసము యగుఁ గాని నిన్నువిచ్చినపిదపన్
వ్రాసిన దంతయు నీకథ
నీసందేశంబ యని విసిగొనుఁడి నగుచున్

రామా! నన్గుణించితే పిలిచినే నమ్మంటివే జీవన
స్వామీ! ధన్యుఁడనైతి నంచు భగవత్ సామ్రాజ్యముం జేరితే!
కామాదుల్ దొవళించు సాధుఋషి త్యాగబ్రహ్మకు నీకె కహో!
సామాన్యంబు ఘటిల్లెనా వరదుఁ డాశాసించు లగ్నంబునన్

కస్తూరి చన్నగ గీయులఁ
గస్తింబడ నట్లు నిల్చెఁ గారణ మీ "ప్ర
వ్యస్తత కడు నస్థిర" మని
యస్తుంస్మృతి నడిపి యుంటయ కద! మహాత్మా!

అపవర్గ బాంధవం బదికి లౌకికధర్మ
మోలపించితి నంద బాలు నట్లు
కను దిక్కులేక సోలిన మూఁగజీవాల
మూల్గు మాన్పితి శాక్యముని విధాన

సతత క్షమా ప్రేమ శరణమై నర దైత్య
కిల్బిషం బోర్చితి క్రీస్తు వోలె
ఆత్మ నిత్యము దైవ మది యొండె యని ప్రతి
ష్ఠింపఁజాలితి సోక్రటీసు కరణి

బానిసము వ్రేఁగు డించి కింపాకజాతి
కండగా నిల్వఁబడి తబ్రహాము పగిది
నద్భుతంబాయె మనుగడయుంద కాక
మృతివిధిన్ వీరి ననుసరించితి మహాత్మ !

విను రామాదులఁ జేర్చి మెత్తు రది మన్నింపన్ రిపుగ్రీవముల్
రణరంగమ్మునఁ గోసి రక్త ఝురిలో రామాదు లోలాడి రా
పనికిన్ నీకును లేదు పొత్తు రిపుతన్ బాధించి విద్వేషిపై
నెనరుం జిమ్మెదవీవు చిక్కఁదు ప్రభూ ! నీయోగ మెవ్వానికిన్

చిరదాస్యమున బ్రుంగి పిఱికివాఱిన జాతి
కలవరించితివి సాహసికముద్ర
మోకఱించి కృపాణములు సలాములు సేయు
నస్త్రమెత్తితివి సత్యాగ్రహంబు
పరధర్మములుబ్బులె పరువులెత్తెడివారిఁ
ద్రిప్పఁజాలితివి జాతీయవిధికి
అడుగడ్గునకు నడ్డపడిన కోటలఁ గూల్చి
సవరించితివి సమాజవ్యవస

దిక్కుటుంగక రేపవల్ దేవురించు
ప్రజకు నేర్పితి వాత్మగౌరవ సమీక్ష
బాపుజీ! స్రష్ట వీవు నీ చూపుసోఁకి
ద్రష్టలైనారు కొంద ఱీ తరమువారు

వేయి గాదు లక్షవిశ్వకళాపరి
షత్తు లెన్నినాళ్ళు మొత్తుకొన్న
నేర్పలేని తెల్వి నీ వీజగమ్మున
కిచ్చినాఁడ విరులు విచ్చి వీడ

పెఱబాసల కొల్వునకున్
బోరలుట జాతికి విషమ్ముపోయుట యని తెం
పరివై చాటితి వీఁక నె
వ్వారు దిక్కొఁ దేశిపల్కువఱువ ట్లుడుపన్

నీ పల్కుగాక యీ నిఖిల భారత మహీ
చక్రంబుదిద్దు శాసనము గలదె
నీ యుక్కిగాక పండిన పాపముల నెల్ల
రాపాడు పుణ్యతీర్థమ్ము గలదె
నీ కిన్కగాక మానిసిగుండెలోఁ దూఱి
చెడుగుపాడు పెకల్చు శిక్ష కలదె
నీ కూర్మిగాక నిర్ణిద్ర యోగసమాధిఁ
బడలి సంపాదించు పదవి గలదె

కలదె నీ జీవనపథమ్ము గాక లోక
శర్మ సంపత్తి నొదవించు ధర్మశాస్త్ర
మద్వితీయంబు నీ తపస్యావిధాన
మెవ్వనిమనీష నిల్చు నిన్నెఱిఁగి పల్క

నీ పరమోపవాస మతినిష్ఠితమంబయి శైల సాగర
ద్వీపపరిశిష్ట విశ్వజగతిన్ వడఁకించుతఱిన్ భయార్తులై
పాపులు బల్లెముల్ మఱితుపాకులు బాఁకులుఁ బెట్టి తావక
శ్రీపదపీఠిపైఁ నొరగి సిగ్గిలి రేమితపస్సురా ప్రభూ !

అనఘ ! నీ శిష్యగునిదూరా వగుట విశ్వ
మానవీ మానవుల్ భగవానుపట్లఁ
దేటపఱుపనిభక్తి నీదెస నెలార్తు
రసలుకొంటెను నడ్డి పుద్దెనయట్లు

అంకిలివీడి నిర్భర వయః పరిపాకమునందె యింద్రియా
హంకృతిఁ దూల్చి పూనితి మహామహు లోర్వని బ్రహ్మచర్యమీ
బింకము చేసినాఁడు వలపించి జగంబులనెల్ల నిట్లు నీ
లెంకలఁ జేసికోఁ దగవ్రతీ ! తెలిసెం గిటు కెల్లఁ గోమటీ !

వలపుల్ చిమ్మెడు పూలచెండ్లవలె సేవాధర్మ నిర్మాతవై
మలపిండంబుల నెత్తి వెటితి; వసీమత్యాగమ్మై ప్రాణముల్
బలిదానంబిడఁ గంటి విశ్వహితముం బాటించి; నీ బాటలో
నిలువంజాలిన మానవుం డెవఁడు గాంధీ ! ఖండ ఖండమ్ములన్

స్వమత విధుల్ ప్రశస్తములు సత్యములంచు భజింతు నన్యధ
ర్మముల సమాదరింతు నపరాజితసూత్రములన్ గణింతు నీ
సమరసదృష్టి ప్రాక్తనులు శంకరముఖ్యుల కింత యున్నచో
సమయము లెన్న క్రిందుపడి శాంతి యదెంత ఫలించియుండునో

లాఠీనెత్తి విశాలభారతము నేలంజూచు దుష్టప్రభు
త్వాటోపం బడఁగించు టెట్టులని తీవ్రాలోచనా మగ్నమై
బాపుంగానని యోధమండలము మేల్సల్పన్ నాఁడు 'క్విట్టిండియా'
యాటంబాంబు సృజించి డించితివిరా యాంగ్లేయు రాజ్యోద్ధతిన్

దారిద్ర్యంబు నవిద్యయుం గవిసి పంతాలాడినన్ భూపతుల్
చేతుల్ నెత్తుకు పీల్చి పీల్చి బహుధా పీడించినన్ జీవనా
ధారంబై జగ ముద్ధరించు బహు గాత్రప్రాణబంధుండవై
తే రాజ్యంబున కర్తవాఁడంటి వది సిద్ధింబొందు టేనాఁటికో!

వలదు పరాన్నభుక్కుల నివాసము లీ పురముల్; పదంబిఁకన్
నిలుపక పొందు పల్లెలకు; నేర్పుఁడటన్ జదువుల్ సదర్థముల్;
వెలుఁగులు నింపి భారతిసవిత్రికి నాయువుపట్టులైన యా
పొలములు దున్నచున్ నలిఁగిపొండని తోలితివోయి పౌరులన్

బడలెద వేసవోలె మన భాగ్యము పంటకు, రాట్నపాటుగా
సుడివడె దాత్రరక్షణకు, సూత్రమవై సకలప్రజావళిం
బడుగున బేసలోఁ గలిపి పట్టెవ, వెట్టి విపత్తి మూఁగినన్
జడియక నిచ్చలున్ బిగియసాగెదురా కమరై మహాప్రభూ!

మొద్దుగ నూఁడుఁగాక వెల ముమ్మరమయ్యెడుఁగాక దీక్షమై
ఖద్దరుకట్టి పేదలకు గంజినిబోయుఁడు భారతార్థికా
పద్దశ దీనఁ బాయునని పల్కితి వూపిరిలేని రాటపున్
ముద్దియ తేఱి తెప్పిఱిలి మోహనసూత్రము లాలపింపఁగన్

నీ కదలించిన ఖద్దరు
నీకీర్తి విధాన జగతి నిండారెఁగదా
రేకెత్తిన జాతీయత
కాకల్పం బిది పతాకయై అంపిలుతన్

వంటయు నంట్లు తోముటయు వల్లభు చేతి విలాసవస్తువై
యుంటయు గర్భరావదురుద్ధతికోర్చి ప్రజా పరంపరన్
గంటయుఁ గాక శోకమును గానని భారతనారి నీ కృపన్
గెంటెఁగదా పర ప్రభుత కెవ్వానఁ గేకలుపెట్టి పాఱఁగన్

నీ వస్పృశ్యుఁడ వీ వవాచ్యుఁడ విసీ! నిన్ జూచినం బాపముల్
ప్రోవై చుట్టునటంచు శిష్టు లెవనిం బోనాడి, రా మాల యీ
జీవ ప్రేతము వెల్గెడిన్ హారిజన శ్రీనాముఁ డారాధ్యుఁడై
యీ వే దివ్యసమాధిలోఁ దలఁచితో యీ పేరు యోగీశ్వరా

శంబుకు వంటి సాధువులఁ జంపక, సంపద లేమి యన్న భే
దంబులు లేక సర్వజనతా సమతా సహజన్మతల్ సభ
ష్యంబులుగాఁగ శాంతి పరిశోభితమై నుతిగాంచు రామరా
జ్యంబున కాసచేసి చరితార్థత నందకమున్నె సాగితే

రాజేంద్రుండు పటేలజాదు విబుధారాధ్యుండు నెహ్రూ భవత్
సౌజన్యంబున వీరులై వసుమతీచక్రంబు శాసించుచున్
జేజేలందిరి; నేఁడు వారిపథ మాసేధించి వేధించు శం
కా జాడ్యంబు లడంచు దిక్కెవరు కక్కా! భీతి క్రొళ్ళ్యెడిన్

ఒకనాఁ డాంధ్రుని పెంపు డించుటకు నేదో కుంభకోణంబు నేఁ
తకునై తోరముగట్టితీవని మహోదగ్ర క్రుధావిభ్రమద్
భ్రుకుటిం జూపితి వెఱ్ఱినై చిలిపిగంతుల్ వైచితిన్ దండ్రి! నీ
యకలంకాశయ మవ్వలం దెలిసె నాయజ్ఞానమున్ సైఁపవే

ఒడ్డారించి నిరుక్ వధించి కుటిల వ్యూహమ్ము ఖండించి మా
జడ్డల్ పోయెనటంచుఁ బ్రేంఖణములన్ సారించి కజ్జాయముల్
లడ్డుల్ పంచిన మూఁక భారతము నేలన్ నేల దయ్యాల కే
యడ్డుం బోఁకయులేని రంగమగుఁ గాదా భావి యెట్లున్నదో!

* • * *

కుల వర్గములఁ గుళ్ళి కుమిలిన నీ మతం
బుద్ధరింపఁగఁ జక్కఁ దిద్దు కతన
మాలకై మందారమాలకై సేసి నీ
దేవాలయము తల్పు దెఱచు కతన
పొగలతో సెగలతోఁ బొగులు హిందూముస్లి
ములకౌఁగిలింతలు వలచు కతన
పేద సాదుల నెత్రు పీల్చి గట్టునఁ బ్రేఁచు
సాహుల నదలింప సాగు కతన

ప్రజ నెదిర్చిన నాఁడు మీ బ్రతుకు లేవు
లేదనుచుఁ గింప్రభుల మందలించుకతన
కాల్చితివటరా జగత్ప్రియా కర్మయోగి
లోక మూర్ధాభిషిక్తు - గోడ్సె కిరాత !

శతధా-కాదు-సహస్రధా తునియలై సామ్రాజ్యవాదం బహో!
యాతెలంబున్ సుశీలంబునంటుతఱిఁ బ్రాజ్యంబుల్ ప్రజారాజ్యముల్
క్షితినెల్లన్ వికసించువేళ నసురస్పృహ్యాం బసహ్యాంబు నా
మతిరాజ్యంబున కుద్యమించి తివటరా మాత్సర్యధుర్యాగ్రణీ !

మతము పేరెట్టి కపటధర్మములు పల్కి
మోస మెఱుఁగనిసాధుల ముంచి మంచి
బోట్లు పెట్టెడువారికి బుద్ధిసెప్ప
కాల మేతెంచె నని యెఱుంగవె జడాత్మ !

పుట్టుకతో నాధిక్యము
పెట్టున్ సోమరికిఁ బెద్దపీఁటను వైచెన్
మట్టుకొనరాని మూఢవుఁ
గట్టా ! నీ మెచ్చుమతమకద సృజియించెన్

బుద్ధి లోకనికి నొకనికిఁ జెక్కభజన
ప్రభువు యొకనికి నొకనికి బానిసమ్ము
గ్రుడ్డు మొకనికి నొకనికిం గసటుకూడె
మేమునే భ్రాంతి మేమిహిందూమతంబు

ఆనాఁ డేసువపుత్త్రరక్తమున దాహం బార్పుకొన్నట్టి యూ
దీనాఁ డెందును దిక్కులేని పురుగై దేఁకారుచున్నాఁడు నీ
వే నీచత్వము నేలెదో మఱియు నేయేహింసలం గూలెదో
దీనత్రాణ పరాయణుల్ ఋషివరుల్ దిక్కెందు వేనఃఖనీ!

చిత్తయినారు లే దనుజశేఖర! నీ ఖరవృత్తిముం దిలా
భృత్తనయున్ వధించిన-మహీంద్రుని నానుజ నాశ్రితంబుగాఁ
గత్తుల బావిపాట్ల కెరగా నొనరించిన-స్పర్ధగాని వాల్
కుత్తుక నొత్తి అంపమునఁ గోసిన నాఁటి ప్రభువు లందఱున్

అక్కటా! క్రిందువడియెఁగదా కిరాత
జాతి కంటెను బ్రాహ్మణ జాతి యనుచు
జనదేవుని ధిక్కరించిన సాధుమతికిఁ
బ్రణుతు లర్పింతు వేటూర్ ప్రభాకరునకు

బోయఁడు విప్రుఁడై భువన పూజ్యుని రాముని కీర్తి నిల్ప రా
మాయణ సృష్టిచేసి నుతులందె నొకా నొక నాఁడు విప్రుఁడే
బోయతనమ్ము నంది ఋషిపుంగవు నేఁడు వధించె రాము సే
వా యజనార్థి చిత్తుఁ దన వంగిన మాలని లజ్జఁ గ్రాఁగఁగన్

వేదము గ్రోల్చి ధర్మపదవీ నదవీయసియైన బుద్ధిఁ
బాదులు కట్టి పుణ్యముల పంటలు నాఁపు మునీశ్వరాంతికిన్
మూఁదలయైన విప్రకులమున్ బలితాళి యొనర్చు నేఁడు ము
శ్వేదన పాలుచేసె నపవిత్రుల పుట్టుక కట్టెనే కదా!

విప్రకులంబె కాదు కనువిచ్చిన హైందవ సంఘమెల్ల నేఁ
డప్రతిమ త్రిపాపిహితమై భయ దుఃఖ ధురా పరిచ్యుత
క్షిప్రతమై ఖలుఁ డొకఁడు చేసిన పాపము జాతికే వినా
శ ప్రదమంచు నేడ్చె నవశమ్ముల ముప్పదికోట్ల గొంతులన్

ఏడ్చుటె కాదు భీష్మతర మీ ఘటనన్ విను చెంద తెందఱో
యూడ్చిరి మేను-క్రైస్తవులు యూదులుముస్లిము లెల్ల వారలున్
మోడ్చిరి మోము నవ్వఁగల ముంపులతో దిగువాఱి కంటినీ
రోడ్చిరి విశ్వవీథి నిలయోదధి పొంగులు రేఁగెనో యనన్

చచ్చిరి దేశభక్తులు విశాంపతు లిద్ధకవుల్ ప్రవక్తలుం
జచ్చిరిగాని ము; న్నవని చావునకుం బ్రజలిట్లు క్రుంగి; రే
సచ్చరితుండు పోవునెడ సర్వజగంబు లిటుల్ విలార్చె న
త్యుచ్చతరాదరంబు, హృదయోద్గత భక్తియు సానుభూతియున్

* * *

నాపై బాంబులు ప్రేల్చినట్టి మనుజున్ నాపాలి చుట్టమ్ముగా
నా పుణ్యమ్ముల పంటగాఁ దలఁచి లేనవ్వుల్ వెలారించుచున్
దాపం బింతయులేక యే నరిగినన్ దామప్పుడా నన్ను వా
ణీపారమ్యముఁ జూపి మెచ్చెఁడని తండ్రీ! పల్కు పండించితే

క్రుళ్ళిన యెముకకై కుక్క గుంపుల వోలె
నధికారమునకుఁ గాఱాడువారి
లంచాలగడ్డి కాసించి సేవా ధర్మ
నియమముల్ బలిసేయ నేర్చువారి

కుహనా వణిజ్యోపగూహ నోద్రిక్తులై
సుధవోలెఁ బ్రజనెత్తురు జుఱ్ఱువారి
పరమత ద్వేషాగ్ని మరగి నారీ వృద్ధ
శిశు మండలిని జీల్చి చెండువారి

దేశ హిత కృత్యముల పేరఁ దెచ్చు నర్థ
మాత్మ బంధువులకుఁ బంచు నట్టివారి
బ్రతుకుఁ గనలేక కన్నుమూసితివి గాని
కలఁడె నీ గుండెపైఁ బ్రేల్పఁగల మగండు

నిన్నుం గొల్చినయట్ల కొల్చి నిను ఖూనీ చేసి రే గోముఖ
చ్ఛన్న వ్యాఘ్రము లే పయోముఖ విషస్థాలుల్ దయాసూనృతా
స్కన్నుల్ వారలె నీకు దేవళములం గట్టించు పన్నాగముల్
పన్నంబూనిరి స్వప్రయోజనకరం ప్రజ్ఞావిధాచుంచువుల్

బుద్ధుని యెంపముక్కల కపూర్వముతో గుహ లిల్లె కట్టి సం
సిద్ధనమెల్లఁ జూపి రపవిత్రవిధుల్ కథలుం బురాణముల్
వృద్ధియొనర్చి రాతఁ డుదయించిన భూములనుండి యెన్నఁడో
బౌద్ధము నెట్టివైచిరి జపాను సయాముల నాశ్రయింపఁగన్

అతని హృదయంబ మధుర శిల్పాభిరామ
నిలయమై ప్రీతి సంధించు నీ; కెవండు
బ్రదుకులోఁ జావులో నీదు బాట ద్రొక్కె
పీడితప్రజకై సల్పు నూడిగంబు

మనుజుఁడవుగావు నీవు కోమటివిగావు
బడలిపోయిన భారతీయుఁడవుగావు
కావు గాంధివి లోక లోకముల వెలుఁ
గూపు నిరవధికామరజ్యోతి వోయి!

నశ్వరమైన కాయము వినాయక ధూర్తుఁడు కూల్చెఁ గాని నీ
శాశ్వతమైన యాత్మ నెటుచంపఁ గలం డతఁ; డస్త్రశస్త్ర తీ
వ్ర శ్వసనాగ్ను లేకమయి వచ్చునపో! యదిలెక్కసేయ దీ
విశ్వము దానిచల్వ శుభవృద్ధము సత్యము సుందరంబగున్

శతజన్మార్జిత మామకీన సుకృతస్థానమ్ముగా నీ జగా
బ్రతుకున్ జూపెడి కావ్యమున్ సుకవితాప్రౌఢమ్ము నిర్మించి నా
బ్రతుకుం ద్రోయఁదలంచుకొంటి మును; పాపం బెద్దియో పండి నీ
మృతిపై నేఁడు కృతిన్ రచించితి మహోర్మిం బోని కన్నీటితోన్

౮—౨—౪౮

# నివేదనము

తెలుఁగువారి యౌచిత్య రాసిక్యము లిటీవల వెల్లివిరిసి కనకాభిషేకాదులతో నన్ను నిడుఁబ్రోలిలో సత్కరించుట జగమెఱింగిన వార్తకదా !

ఆనాఁటి (౨౯-౧-౪౯) మహాపరిషత్తులో, ఆ యపూర్వ దృశ్యములో, ఆ మధుర మధుర సన్నివేశములలో, ఆసమ్మాన స్వీకృతిలో, నాహృదయమునుండి పొంగి పొరలి జాల్వాఱిన రసోద్రిక్త భావనాశిల్పమే యీకావ్యము.

కృతజ్ఞతాబద్ధమైన డెందముతో, భక్తి సంపన్నమైన కైమోడ్పుతో, దీని నాంధ్రభారతీ చరణపీఠికపై నొక పూజాపుష్పముగా సమర్పించు కొనుచున్నాఁడ.

విధేయుఁడు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# తపస్సిద్ధి

తెలుఁగుం దేవత లెల్ల వచ్చి నిడుఁబ్రోల్ తీర్థమ్ముగా మారె నా
తెలుఁగుం గొల్వున కాటపట్టయిన యీ దేశమ్ములో, సాధ్వియౌ
తలి జన్మించిన గడ్డలో జయజయ ధ్వానమ్ములం గంటి నా
తొలినోముల్ ఫలియించె నేఁడు పితృపాదుల్ పెంచు ధర్మంబులున్

నా జనకుండు పావనగుణ స్తవనీయుఁడు నారయార్యుఁ డే
తేజమునందొ నాదయిన దృష్టికిసందక డాఁగియుండఁగా
నా జనయిత్రి నాయెడఁద నమ్మిన దేవత చెంచమాంబ యీ
రోజున నాసిరుల్గని విరుల్ కురియించె మదీయ భాగ్యముల్

ఈ పుంభావసరస్వతుల్ సుకవిమత్తేభంబు లీకృత్స్న వి
ద్యాపారంగతు లీజగద్ధితులు సౌహార్దంబు గుప్పించుటన్
నా పాండిత్యము నా కవిత్వమును ధన్యంబయ్యె నివ్వీటిలో
నీపర్వోద్గతి నీసదస్యులకు ముందే నర్థిమై మ్రొక్కెదన్

సద్దేశిక సర్వతోముఖకలాహేవాకరోచిస్తతిన్
నా సాహిత్యమెలర్చె నద్రితనయానాథార్చనాధీనధీ
వాసున్ వాగపరావతారు నతనిన్ వర్ణింతుఁ దాడేపలి
శ్రీసంతత్యుదితున్ గృపాప్పతి నఘుచ్ఛిద్వేంకటప్పార్యునిన్

రాశీభూతములర్థముల్ తురగముల్ రాజ్యమ్ము లూర్జమ్ము లే
యే శక్తుల్ తనకుండుఁగాక పురుషుం డెవ్వాఁడు రాణించు నీ
యాశీర్వాదము లేనినాఁడు భవదీయాభ్యర్చనాసక్తి యా
పై శారద్యము రానినాఁడు కవితా వాణీరతీ! భారతీ!

నాచిన్నప్పటినుండి నిన్గొలుచుచున్ నానాఁడు నీసేవలో
ధీచైతన్యమునంది డెందమెటు లుద్రేకించి వర్తించు న
వ్వాచీనాదమునన్ శ్రుతిన్గలిపి దేవి! యాడితిం బాడితిన్
ప్రాచీనాధునికాంధ్రవాఙ్మయ మహా పాథోధిలో నీఁదుచున్

ఏదియో వ్రాసితి నిచ్చవచ్చినది యుం దేదో కవిత్వమ్ము నీ
పదమంజీర ఘులంఘులామధురశబ్దస్ఫూర్తి వర్తించుచు
న్నది యంచున్ రసలుబ్ధలోక మిటు లానందించి సంధించు నీ
పదవిం జూచెద నీదువైభవముగా బ్రాహ్మీ! దయాంభోనిధీ!

రూకలతీపిలో మనుజరూపము గన్ననిశాటు, నుగ్రద
ర్పాకరు, లోకమాన్యపదవీచ్యుతు నెన్నఁడు మెచ్చలేద! య
ప్పాఁకలకోడి మైలవడినట్టిపదమ్ముల నంటలేద! త
ల్లీ! కరుణించి నీవిడిన యెల్లయు మల్లియ వోలెఁ బెంచితిన్.

కళక్లాఱకే కవిత్వమని గంతులువేయక రోఁతరోఁతగా
వలపులునింపి కబ్బములు వ్రాయక విశ్వజనీన బోద్ధృతా
లలిత, ముదారవృత్తము, కలాకమనీయము, సంస్కృతిప్రభా
మిళితము నైన సృష్టి నెద మెచ్చితి జాతికిఁ గాన్కలిచ్చితిన్

నన్నున్ మించిన సత్కవిప్రభువు లున్నా రెందఱో నేఁడు వి
ద్వన్నాథుల్ మఱియెందఱో కలరు నీ కారుణ్య సంపత్తియే
మున్నై నిల్చుట నిట్టిగౌరవము నా మూర్ధమ్మునం దాల్చితిన్
పున్నెంబుల్ ఫలియించి వచ్చుటను నీ పూజాకినై నిల్చితిన్

అంచితులైనవారు కొని యాడిరి, బంగరుపూలజల్లులో
ముంచిరి, గండపెండియరమున్ ఘటియించిరి, యేన్గుమీఁద నె
క్కించిరి, హేమకంకణము నిచ్చిరి, వేలకొలంది కానుకల్
నించిరి యే వలభ్యములు నీ కృప గల్గిన యట్టి వారికిన్

జగదానందక రాప్పికట్ల నగరీ సత్కారపూరమ్మునన్
జగురెత్తించితి వస్మదీయహృదయ శ్రీసుంజ మానాఁడు నేఁ
డగురా! క్రొవ్విరిగుత్తు లొత్తుకొనఁగా నత్త్రావు నెత్తావికిన్
జగిలెంజేసితి యుష్మదీయములు వాత్సల్యంబు లేపాటివో!

చెళపిళ విశ్వనాథ కవిసింహులు వేలురి వాసిరెడ్డి పె
ద్దలు మఱి జాషువాదికవితల్లజు లుల్లము విచ్చి మాధురీ
కలితకవిత్వముల్ కురిసి కమ్మనిసంపుట మిచ్చి మెచ్చి రీ
కలిమికిఁ జాలునా యితర గౌరవముల్ పదివేలుదక్కినన్

ఏనుఁగుమీఁద నెక్కి పురమేగుతఱిన్ దెసవెల్లదిక్కులన్
మానవులే! యిదేమి యభిమానమొ! యేమియుదారభావమో!
నానిఖిలమ్ము వీరిచరణమ్ములపై నెఫుడుంచి నమ్రతా
స్థానమునై ఋణచ్యుతపదమ్ము గడించెదనో! సరస్వతీ!

ఏనుఁగునెక్కుటన్న నదియేమొ మదాత్మ 'ససేమిరా' యనెం
గాని సమస్తధర్మపరిణద్ధమనస్కులు మిత్రులాప్తులున్
దానికి నొప్పుకుంట జనతాకుతుకంబు నవార్యమాటఁ ద
ల్లీ! నినుఁ జేర్చినట్టులె మదేభముమీఁదికి నన్నుఁ జేర్చితిన్

మును పౌకరాజులే సుకవిముఖ్యులకున్ ధనధాన్యవస్తు వా
హనములు కాన్కవెట్టి కవి తార్చవసల్పిరి; రాజధర్మముల్
జనులకు సంక్రమించిన ప్రజాయుగ మియ్యదియాట లోకమే
మునుపడివచ్చి నీకొలువు మోసల నొదలసంచె భారతీ !

తనవాఁ డెంతమనీషియైన, సముదా త్తప్రాభవోపేతుఁ డై
నను మన్నింపఁడు తెన్గువాఁ డనెడి నిందల్ మోసె నీజాతి ; నేఁ
డనవద్యస్థిరభక్తియోగమున ని న్నర్చించి మెప్పించుటన్
జననీ ! యాంధ్రసరస్వతీ ! తుడిచె మచ్చన్ విశ్వవిఖ్యాతమై

దేశముకొఱకై బ్రతికి ధ
నాశలు దిగఁద్రావి యెవ్వఁ డంచిత ధర్మా
వేశుండగుకవి, యతఁడె ప్ర
జా శంసాపాత్రుఁ డనుట సత్యంబయ్యెన్

నాకవనమ్ము రేకులు తనర్చెడి ప్రొద్దుల భారతావనిన్
నాకవనమ్మువోలె సుజనప్రియమంజులసౌరభమ్మునన్
బ్రాఁకిన గాంధిధర్మ మొకపాటిగఁ బ్రాక్తనపుణ్యముంటచే
నాకు రుచించి తెల్గులకు నన్నొక విందునొనర్చె భారతీ !

ఈ సన్మానములోన మైమఱచి యేనేదో యహంకార ధీ
దాసత్వంబున కిచ్చ సేయక జడత్వంబూన కీప్రాణముల్
నీసేవావ్రతదీక్షలో విడుతుఁ దల్లీ ! త్వత్కృపాసంపదల్
రాసుల్ రాసులు వీనిపైఁ బఱపు మారాధింతు వాగీశ్వరీ !

ఏను నిమిత్తమాత్రుఁడుగ నింతటిపండువు నీకొనర్చె, నేఁ
డనిఖిలాంధ్రలోక; మిట నేచిన కావ్యకలానురక్తిఁద
ల్లీ! ననువంటి భక్తులు మఱెందఱొ పేరనొ త్స్వమ్మహోత్సవ
శ్రీనిచయమ్ము లీ తెలుఁగు సీమ ననంతములై చెలంగుతన్

సాక్షాత్త్రావకమూర్తి, విశ్వకవితా సౌందర్య రేఖారహో
వీక్షాదక్షమనీషి, మాతృజగతీ విజ్ఞాన పీఠప్రథా
రక్షాశీలుఁడు, కట్టమంచికుల మూర్ధన్యుండు, నన్మెచ్చిన
ధ్యక్షుండయ్యె, నిఁకేమి కావలయు నంబా ! నా తపస్సిద్ధికిన్

తిక్కన కైతలోఁతులు మథించిన రెడ్డి మదీయవాగ్ధునిం
బుక్కిటిబంటిగా మునిఁగి పోయెనటే ! "కనులున్నఁ గానరో
చక్కనికొమ్మ పోరు" లని చాటె నిజానుభవమ్ము; సాహితీ
రుక్కమనీయ వైభవ నిరూఢున కీతని కంజలించెదన్

రెడ్డికిఁ దోడుగా నిలిచి రెడ్డికి దీటనిపించి యీఁదినాఁ
డొడ్డులు దాఁక నాంధ్రకవితోదధి పింగళి; తచ్చమత్కృతుల్
జడ్డలుజడ్డలై విరియ సాగి సభాస్థలియెల్ల వింజ మూఁ
కిడ్డటులయ్యె నెంతటిమహిమ్ముని గాంచితివమ్మ భారతీ !

పారిశ్రామికమంత్రి నాడు కవితాపట్టాభిషేకోత్సవ
ప్రారంభమ్మొనరించుటన్ గవనశిల్ప శ్రామికానందముల్
పారావారములయ్యెఁ గోర్కెలెపుడుం బండించి యేతాదృశో
దారున్ రెడ్డివరేణ్యుఁ బ్రోవఁగదె సీతారాము వాగీశ్వరీ !

అసదృశదీక్ష క్రిందుకొన నాంధ్రమహాసభ నేలు సాహితీ
రసికుఁ డుయూరుసీమయువరాజు గుణమ్ములప్రోవు మత్కృతి
ప్రసవసమర్పణోత్సవసభాపతిగా దయచేసెనట్టె! నా
దేశ ననురక్తిగా నభిమతించెనొ నీదెసభక్తి భారతీ!

కృతికర్తల్ కృతిభర్తలున్ రసికతాకేంద్రమ్ము లాంధ్రక్షమా
పతిచూడామణులున్ వెలింగినమహావంశమ్మునం బుట్టి మత్
కృతిదానోత్సవసత్సదస్సుఁ దొలుతం గీర్తించె నెవ్వాఁడు సం
స్తుతిగావించెద వాని శాసనసభేంద్రున్ రామకృష్ణప్రభున్

ఇతఁడు ప్రజాహృది నెఱిఁగిన
కతనన్ బ్రజమెచ్చుకొన్నకవి యని నన్నా
దృతి సేసిన దేవులపలి
నుతి సూటికినూఱుపాళ్లునున్ నిజమగుతన్

రంగాయంతటివాఁడు రివ్వుమని చేరవ్వచ్చియూరెల్ల మా
తంగప్రాగ్రసరుండుగా నెలసి మత్కావ్యప్రశంసల్ సభా
రంగంబెక్కి వెలార్చి భూరిసుమనోరాశిన్ ననున్ దేల్చి స
ర్వాంగీణమ్మగు శోభ దెచ్చెను మదీయం బిమ్మహాలక్ష్మికిన్

కడపన్ నిద్దురలేచి హాస్తిపురిలో కాఫీని సేవించి చే
కెదురొట్టెన్ కెయిరోకడన్నమలి పారిస్ ఫ్రూటుకూటింటిలోఁ
గడుపున్నింపి హితోక్తులాడును టుగ్రిమన్ కల్పించు దర్బారులో
నిడుఁబ్రోలీసుకుఁ డెట్లువచ్చెజననీ! నీశక్తిఁ గాకుండినన్

తా రాకుండిననేమి రాష్ట్రసచివత్వవ్యాపృతిఁ బున్ని క
ల్లూరి శ్రీకులచంద్రమౌళి; తన వెల్గుల్ మామకీనోత్సవ
శ్రీరంగస్థలిదాఁకఁ బర్వలిడి వచ్చెన్ సారకర్పూర నీ
హారోదారసుధోపహారములు సభ్యప్రీతి సంధింపఁగన్

తల్లీ! తెల్గును నేర్పు నాదగు నుపాధ్యాయత్వమున్ బెంచు మా
యిల్లాబోడ్డు మదీయ సత్కృతుల కాశీర్వాదముల్ పంపె నీ
యెల్లన్ రాష్ట్రమునేల్ గవర్నరును దానీచేత నగ్గించె నిం
కల్లెన్ నేఁడు ప్రజాభిమానముల కుజ్జీలై ప్రభుత్వాదృతుల్

ఒక సాహిత్యవిభూతి ప్రబ్బుటయ కాదో తల్లి! యీనాఁడు తా
వక సంగీత విభూతియున్ జతపడెన్ వాసంతవేళాపిక
ప్రకటారావమునించి నాగయ నినున్ బ్రార్థించి కీర్తించుచో
గకుబంతమ్ముల నేతదీయ పరిషద్ గాథాళి మార్మ్రోఁగుచోన్

జగడము నొల్లని నారద
భగవానుఁడు తెల్గుగడ్డఁ బాయని త్యాగ
య్యగదా! చిత్తురినాగయ
సొగసితి నీతని సుహృత్తసొగ సిట్లాదవన్

ఏమహావాగ్గేయకస్వామి మధుర
మంజుసంవాదినాదంబు మామకీన
కావ్యకన్యకా కల్యాణకాల మంగ
ళాచరణ మాయె నతని నపూర్వునెంతు

మణిదీపమ్ముల భూభృ
న్మణి వాఙ్మయపోషణాత్తమంజులయశశ్శ్రీ
ఘృణి నీకు నివాళించెను
జననీ ! ముక్త్యాలవిభుఁడు సంసన్నుతుఁడై

ఏమిభక్తి తల్లి ! యిది యుష్మదుద్భవ
శ్రీగనంగ నెట్లో చేరికొనిరొ
తనువు పండిపండి తాత యయ్యెను యార్ల
గడ్డ రంగనాయక ప్రభుండు

* * *

ఈ సభలో శ్రీ ఎన్వి. సుబ్రహ్మణ్యముగారికి నా "ఆత్మకథ"
సమర్పించుటయొఱుంగుఁడు

తోడ్పై దీర్ఘతరప్రయాసలకుఁ దెల్గుంగైతకుఁ గౌరవ
స్థానంబిచ్చుట సంతరించుకొని రీ సమ్మానసంఘమ్ము వా
రి నిర్వ్యాజకళాభిమానమున కే నెంతే వినీతుండనై
ధ్యానింతుఁ నిరతంబు వీరి మధురౌదార్యమ్ము సౌజన్యముఁ

తనకుం గూర్చునమాత్యులై కవిజగత్తారుణ్యకల్యాణకృ
ద్గుణులై తుమ్మల వుప్పలాన్వయమణుల్ కోటయ్య నాగయ్య లు
క్కున దీపింప నిదంవిధోత్సవము తెల్గుక్షోణి కక్షీణము
ధ్యనముం గూర్చినవాని మెచ్చెదను సీతారామ ధీమద్విభుఁ

పత్రికలో నితండు తన పండువ కొగ్గుట జూచి "భారతీ
మాతృప్రసేవనమ్ము పదిమందికి నిష్టము గాని పుష్పమో
పత్రము చాలు నర్చసలుపన్, శ్రమలీవు సహింపఁజాల, వో
మిత్రమ!" యంటివైనన దిమెచ్చుఁడయిమ్మహితాత్ముఁడింతయుఁ

అహముల్ లిప్తలు, విస్మృతాంశములు నిద్రాహారసౌఖ్యంబు, లి
మ్మహికంపింప గమించురైళ్ళ జడధర్మక్షేత్రము ల్గాఁగ లో
కహితావేశము నాఁడి వైభవమిటుల్ కల్పించె "నుత్సర్పిణీ
మహతాంప్రార్థన" యన్నసూక్తికితఁడేమాచూపుతార్కాణమై

వెలువోలు వంగసమ్మున
వెలసిన యీధర్మమర్మవేది తనూదు
ర్బలుఁడయ్యు నాత్మబలమున
నిలిచిగెలిచె నేటియజ్ఞనిర్వహణమునన్

అంటినఁగందుమేను వెల కందనిసంపద రాజభోగముల్
గెంటుసుఖానుభూతి పరికీర్తితదర్పసమృద్ధి కల్గియున్
గంటికి నిద్రలేని తమకమ్మున నిమ్మోడఁ గోటయాఖ్యుఁ డిం
టింటికిఁ బర్వులెత్తె నది యెంత కలాపరతంత్రశీలమో!

కల్పము లెన్ని రేఁగినను కందని కుందని వీరమూర్తియై
జల్పము లెన్ని మోఁగినను జంకని గొంకని కర్మయోగియై
నిల్పె నెవండు కావ్యరమణీవిజయధ్వజ మిందు; సిద్ధసం
కల్పుఁడు నాగయాఖ్యరసికప్రియుఁ డాతని కాయురున్నతుల్

అంతశ్శుద్ధుఁడనై య
గ్గింతు నజాతార శేషగిరిరాణ్మతిన్
చింతలపూఁడి వనమ్మున
నెంతటితియ్యనిరసాల మేచి తలిర్చెన్ !

పిన్నమనేనికులేందుఁడు
పున్నయ పదునాలుగుళ్ల పూజరి యయ్యెన్
మున్నెన్న సభారమా విభ
వోన్నతికై పెనఁగె సాటియొజ్జలు మెచ్చన్

అస్మదఖండ సత్కృతి మహాఃపరిలబ్ధి విధావిరుద్ధ వి
ఘ్నస్మయ భంజకప్రధన కౌశలముం బ్రకటింప నేర్చుటన్
విస్మయమయ్యెఁ గొత్తపలి వేంకటరత్న మనీషిదీక్ష, కీ
సస్మితమూర్తి నాహృదయశయ్యఁ దొఁజంగని వియ్యమయ్యెడిన్

మధుమధుర భావసేవధి
కధరాప్ర శేషగిరి సమాహ్వాయునను మ
త్పథ మొంత తనిపి గూర్చెనో
పృథులాదృతి గురిసె నాదు పేర్మికి మురిసెన్

దానయచౌదరి నాకై
ప్రాణంబులు పంచు నాత్మబంధువు; నేఁ డీ
యేనుంగు నెక్కినాతఁడు
తానా నేనా యటన్న తర్కమువొడమెన్

ప్రబ్బిన కలావిమృష్టత
సుబ్బిన కవితామహత్త సొంపులతో స
న్నుబ్బించు కళ్ళ వేంకట
సుబ్బారావునకు సకలశుభసిద్ధియగున్

నా పేర్మియు తన పేర్మిగ
రేపవలుందలఁచి విస్తరిల్లిన చెలిమిన్
నాపండువుకై డస్సిన
యీ పరుచూర్వేంకయాఖ్యు నెట్టులు మఱతున్

సన్నపనేనిసత్కులుఁడు నాగయచౌదరి యేలుప్రోలికిం
గన్నడదేవరాయకటకమ్మన కబ్బినకీర్తి దక్క నీ
పున్నెము పంటకై సుకవిపూజలకై మహనీయుఁ డీతఁ డె
న్నెన్ని బెడందలెత్తిన సహించి వహించె నుదాత్తధర్మమున్

వంటకమయ్యె మీ రలసి వచ్చిరి మాసుకృతమ్ము నేఁటికిన్
బంటకుఁజొచ్చె లెండని సభాసదులన్ బతిమాలి గేస్తు లిం
టింటికిఁ బిల్చుకొందు రిమదికెంచిన విందులొనర్తు రెచ్చటం
గంటి మిదంవిధాదరవికాసము లీనిడుఁబ్రోలు దక్కఁనన్

పాసూన్నగు నిడుఁబ్రోలు నొక్కపురిగాఁ బొల్పొంది పేరందుటన్
నస్న చోట బహూకరించుసభ నానాదీప్తులన్ గంటకున్
బొసూన్నగన్ బ్రియుతించెఁ దత్పురవిభున్ గొప్పాక వెంకయ్యను
స్కన్నప్రీతిఁదలంతు సత్కవిసమర్చా నిష్ఠలిప్పాఖనిన్

ఆనాఁ డీవు ప్రతిష్ఠ చేసితివి నన్నాచార్యపీఠమ్ముపైఁ
దాన్నై వచ్చిన కైత తద్బలమునన్ దారాపథంబంటె న
ద్ధాసన్ దెల్గులకూడెముల్ సలిపితిన్ ధన్యుండ నైతిన్ భవ
ద్ధీ నైర్మల్యము సంస్మరింతు గుణవార్ధీ! కుప్పుసామీ! యిటన్

“అలఁతియలంతిగాఁ దొడర కన్యదురాసదపూజనమ్ము లం
గొలువుఁడు తిక్కనార్యు; నెదికోరనఁజేయఁగలాఁడ నే; నితం
డలఘు కవిత్వశిల్పచణుఁ డాటయుకా దనఘుండు”నంచు నన్
బలికిన కృష్ణచౌదరికి భద్రము! పాములపాటిమేటికిన్

నన్నను జూంబలెఁ జూచుచు
మన్నిపుణత వలచు ప్రాజ్ఞమణి దాసరి శ్రీ
మన్నారాయణ చౌదరి
ప్రన్నఁదనం బెంతు సౌఖ్యభర మాశింతున్

అధ్వర్యుండై వాణి కర్పూగావించె శే
　　షాచార్యుండా ర్షధర్మాభిరతుండు
వలగొని మ్రొక్కి దివ్యచ్ఛత్రిభోగమ్ము
　　నిచ్చె ముప్పాళ్ళ నాగేశ్వరుండు
వేవేలుఁ గ్రొంగ్రొత్త విరులదండలుగూర్చెఁ
　　గోటయ్య పాములపాటి మొలక
మస్తకమ్మున రత్నమయ కిరీటమునిల్పెఁ
　　గొసరాజుకృష్ణుండు గుణపయోధి
కొత్తపల్లి రాధాకృష్ణుఁ డత్తుకొన్న
భక్తిమై జయగీతమ్ము పల్లవించె
ప్రాజ్ఞలీ వృత్తులెందఱో బలసికొలువ
నొదవెఁ గవితాసవిత్రీ మహోదయమ్ము

• • •

ఆంధ్రజననీసమార్జి తానంతసుకృత
మధురఫలమూర్తి కౌచిలీమానితునకు
స్వాగతము! గోగినేనివంశప్రశస్త
వనవసంతున కౌదార్యవాసితునకు

ఓహో! వేంకటసుబ్బయార్య! సుకవివ్యూహాంబ రత్నమ్మహా
మాహాత్మ్యమ్మున కాదిహేతువని ధర్మప్రీతి సేత త్సుఖ
శ్రీహాసమ్ములుకోరి వేలొసఁగు నీ చిత్తోన్నతిన్ మెత్తు నీ
మాహారాజక సంపదల్ వెలయు నమ్మానమ్ము లిద్ధమ్ములై.

లక్షలుగల్గువారు బహులక్షలు, వారలలోన దాతృతా
దీక్షితు లెందఱో కలరు ధీనిశితత్వము చూపి సత్కళా
పక్షము మెచ్చి, నీవలె నపారధనమ్ము లొసంగి పొంగువా
రీక్షితి నెందఱుందురు మహిష్ఠులు? వేంకటసుబ్బరామాభిధా!

వను నిచ్చెన్ గనకాభిషేకమున స న్మానించు నీ చేతలోఁ
దను వెల్లం బులకించెఁ గాని కవితాదక్షుంబు శ్రీనాథకన్
గనఁగాఁ జాలితినంచు నించుకయు నే గర్వింప గర్ణాటనా
థునిగామాత్రము నిన్ను మెచ్చి వినుతింతున్ నీదు రాసిక్యమున్

తెలుఁగుమహాప్రజా నయనదీధితిలోకములో సహస్రరీ
తుల భవదీయదానకంతో యజరేఖలు తాండవించె నీ
వెలఁదివెలుంగువెల్లువలు విశ్వము నిల్చినయంతవట్టు ను
జ్జ్వలములు పొమ్ము నీజనువు సార్థకత న్గడియించెఁ జౌదరీ!

విన్నార మనవేమవిభుని దాతృత్వంబు
జలజల నొడనెల్లఁ బులకరింప
పఠియించితిమి సార్వభౌము వాచావీథి
హరిహరేంద్ర త్యాగనిరతి పెంపు
తెలిసికొంటిమి గుంటుపలి రాయమహామాత్య
భాస్కరు వితరణ ప్రాభవంబు
విశ్వసించితి మాత్మ వేంకటాద్రినరేంద్రు
సడిసన్న యౌదార్య సాహసమ్ము

నేఁటి కాంధ్రులభాగ్యంబు నాఱఁబండి
చూచుటయు కల్గె లోకవిశ్రుతము సాధు
హితమునై పొల్చు నీవదాన్యతను; దాన
వీరునకు నీకు విజయాభివృద్ధిరస్తు!

కలిమిని సత్సంతానము
కలిమిని వితరణగుణమ్ము కలిమిని గవికో
కిల కులుకు కాకలీ కల
కలముల నీ కుమరి కుదురుగా రవళించున్

* * *

బంగరుగండపెండెరము పాదమునం దొడి నన్ను సాహితీ
రంగము నెక్కఁజేసి శివరామవిభూ! కవిజాతిపట్ల నీ
కుం గల మక్కువన్ దెలిపికొంటివి తావకకీర్తి నర్తకీ
భంగిమ కాంధ్రలోకము సెబాసనుచున్ దలయూఁచె ముగ్ధమై

మనుచరితమ్ము సెప్పి నృపమండలమండనుఁడైన కృష్ణరా
యని మురిపించి బంగరుపుటందియ నందెను పెద్దనార్యుఁ డే
ననితరలభ్యపుణ్యుని మహాత్మునిగా ధను సర్వకాలమున్
మను చరితమ్ముఁ జెప్పి నృపమండన! పొందితి నీబహూకృతిన్

పాలకపాలితుల్లలసభన్ శివభూపకుంజర! నీవు వంగి నా
కాలికి నందెవైచి కవిగౌరవమున్ గొనియాడుపట్ల నీ
శీలముముందు సభ్యులు విశిష్టమతుల్ తలయొగ్గ మోదభా
రాలసచిత్తవృత్తిని జోహారులు పెట్టిరిఁ దల్లి కాంధ్రికిన్

“ఇతఁడు కవీంద్రుఁ డంచు నుతియించుట నాపనిగాదు, నా కయా
చితముగ రాష్ట్రగానమిడి చిక్కని చిక్కనికీర్తిఁ గూర్చి య
ద్భుతమిది మద్గృహాంగణము త్రొక్కఁడు ప్రార్థితుఁడయ్యు నిమ్మహా
మతి” యని నన్నునీవు బహుమానముసేయుట చాలు భూపతీ!

* * *

ముంజేతి కమృత భాషా
సంజీవి సదస్సువారి స్వర్ణవలయమా!
మంజుల కవితా దీక్షా
వ్యంజక మిది నాదువృద్ధికై తోడగుతన్

విద్యాదేవికిఁ బ్రీతమై యమృతలూర్వా వేలుగా వైదుషీ
సద్యోగాంచితులన్ సృజించుకొని మత్సాహిత్యము న్మెచ్చఁగా
నుద్యోగించుటనాయదృష్ట మది గా కోహో! మహాత్యాగ సం
పద్యుక్తుండు నుతించుటా కరణు రామస్వామి నా సేవలన్

ఒకసమ్మానపుఁ బత్రమిచ్చుటను లేదోతృప్తి, ఖర్జూర పే
టికతో దాని బహూకరించి పరిపుష్టింగూర్తు రాదార్య ల
క్ష్మికి నాత్మీయుకు; మంచిపట్లఁ గడుమంచిం జూపి విద్వత్కవి
ప్రికరప్రస్తుతి పాత్రులయ్యెదరు కారంచేడు పౌరాగ్రణుల్

ప్రేమనించి నన్నుఁ బెంచి రిన్నాళ్ళు నా
చిత్రి మిడిరి పెద్దచేసి యిపుడు
తనివి ప్రిబ్బెఁ గాని యెనమలకుదురువా
రేలయు నేమియిడెద నెడఁదఁ గాక

* * *

అది నీ కేతగునమ్మ "మాతృహృదయం" బావిష్కరింపంగ నే
యెదురుం లేని మహాకవీంద్రుఁడును దా నీ చక్క సల్ చూచునా!
ముదిమిం డాసిన నే మఱొక్కపరి నీ మూలంబునం నాదు బా
ల్యదశావాసితమాతృమాధురులు గ్రోలంగల్గితిం సోదరీ!

కృతికర్తృత్వమునం గడించినవి మత్ కీర్తుల్ చిరస్థాయులై
బ్రతుకంగల్గు నటంచు ధైర్యమును జెప్పంజాలఁగానీ! భవత్
కృతిభర్తృత్వమునం మదీయ యశముల్ క్రీడించు నాంధ్రీకపో
లతటీనిత్యవినూత్న సాధుసుషమా లావణ్యరేఖాకృతుల్

అనసూయాహృదయమ్మువోలె మధురంబై స్వచ్ఛమై సత్కవి
ప్రణుతిం నోఁచిన నీకవిత్వమిడి నా భాగ్యంబు పండించితో
* యనసూయా! భవదాదృతిం మఱవ లేనమ్మా! జగన్మాన్యవై
మనుమమ్మా! కమనీయకావ్యతనయా మాతృత్వ సంపత్తితోం

* * *

నాకడ నీవు నేర్చినవి నాలుగుముక్కలు; నీకు నీవుగాఁ
బ్రాఁకి గడించుకొన్న ప్రతిభా ఫలముల్ శతముల్ సహస్రముల్
చేకొనివచ్చి కానుకలు చేసితి నాకవు డీయుదారతా
శ్రీకృతి కస్మదాత్మ వికసించెనురా ♦ పలునాఁటిసత్కవీ!

---

* శ్రీమతి దొప్పలపూఁడి అనసూయాదేవి

♦ శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

ఎట్టురచింతువోయి! బిగువించుకజాలదు వీరభూమిలోఁ
బుట్టిన నీకు నిట్టినుడిపొంకము సాజము! శిల్పివీవు చే
పట్టిన వస్తువెల్ల రుచిబంధురసుందరరూపకల్పనా
పట్టముగా రసజ్ఞహృదయాబ్జము లాఁచికొనుఁ గవీభమా!
అంజెనవేల పేదనసి యాడెదవేల మనోజ్ఞమీ "సువ
ర్ణాంజలి" నిచ్చుచుఁ; వినయమాయిది? యా నది యుగ్గుఁబాలతో
సంజీవవిద్య నీయెడ; వినమ్రరసాలముకాదె మాధురీ
మంజులముల్ ఫలంబు లిడి మానసముం దనియించు నెచ్చెలీ!

*  *  *

ఆయత్తము శైష్యోపా
ధ్యాయిక మనపట్ల నది సమంచిత కవితా
శ్రీ యోగంబిడి *రామా
రాయకవీ! నీకు నాకు రాణ ఘటించెఁ

నాకుంబిడ్డలు పెక్కురుండినను ప్రాణంబెల్ల నీమీఁదికే
ప్రాఁకున్ దేశకులెందఱుండినను నీభావంబు నామీఁదికే
దూఁకున్ నీకును నాకు నేర్పడినబంధుత్వంబు లేనాఁటివో
యీకొమ్మల్ మఱి చిల్వపల్వలుగ నిల్లై సాగి వాసించుతన్

నీ హృదయపద్మవీథిలో నెగసి చిందు
"తేనెచుక్కలు" గురున కందించుకొంటి
శాబకా! తన్మధూత్సవాస్వాదనమున
నితఁడు బంధురమై విశ్వహితము మొరయు

—సి—వి—ర్ర

* శ్రీ శేష్య వెంకటరామారావు

# విజయవాణి

(తెలంగాణా విముక్తి విని)

విజయవాణీ మధురఘోషము
విరిసెరా మన వాడవాడల
కుజన కుటిలవ్యూహ కుడ్యము
కూలిపోయెనురా

ముసురుకొన్న రజఃప్రవృత్తులు
మూలమూలల ముడుచుకొన్నవి
కొసరి మన సంగ్రామకేళీ
రసము పొంగెనురా

వాడిపోయిన తల్లి మొగమున
నాడెరా జాబిల్లి రేకలు
మూఁడుకోట్ల తెలుంగు లిప్పుడు
ముక్తి నందిరిరా

లోకమాన్య స్తోత్రమూర్తులు
కాకతీయుల గుండెమంటలు
చీఁకుచింతలు నేఁటితో ని
శ్శేషమయ్యెనురా

తెలుఁగుజెండా కెదురులేదని
తెలుఁగునాఁటికి సాటిలేదని
తెలుఁగురక్తము పొంగిపొరలఁగ
నిలిచిపల్కు మిఁకన్

నదులు కొండలు తోఁట లడవులు
నగరములు పల్లెలు పయోధులు
పదుగు రౌ నని మెచ్చు ప్రజ నీ
పాలి సంపదరా

సాగవోయి! మహాంధ్రజగతీ
చక్రధౌరంధర్యమునకై
మ్రోఁగుచున్నవి తూర్యరవములు
మోహనారభటిన్

దుష్టశక్తులు తొంగిచూడని
త్రోవలో నీ రథము తోలుము
సృష్టి నీపై సుఁరభిసుమనో
వృష్టి కురియంగన్

౨౯—౯—౪౮

